SREE

# BHAMINIVILASAM

---

BY


VADDADY SUBBARAYADU

SENIOR PUNDIT, GOVERNMENTTRAINING COLLEGE

RAJAHMUNDRY


---


FIRST EDITION COPIES 1000

PRINTED BY

S SITARAMIAH AT THE

Desopakari Press

ELLORE.

---

1902.




Price 10 As.



విచిత్రమైనపాటలు

ఇదివరకెన్నడునువినియుండరు.

ఇకముందిట్టిగ్రంథముదొరకబోదు



# పాటలభారతము

ప్రథమభాగము.

వెల **8** అణాలు

మహాభారతములోని ఆదిపర్వము సభాపర్వములోని భారతకథ న్నియు పాటలుగాను కీర్తనలుగాను చేసి నున్నుపైన కాగితముల మంచిఅచ్చున, స్త్రీలకు సులభముగా బోధపడులాగున గాన ప్ర గ్రంథముగా ముద్రింపబడి విక్రయమునకుసిద్ధముగానున్నది: యీగ్రం ములోని ఒక్క పాటపాడుటకు ఆరంభించినవారు గ్రంథమంతయు రిగచముపువరకు విడిచిపెట్టరు. ఈపాటలు చదువుటవలన స్త్రీలు వారింటనడువవలసిన పద్ధతులు పతివ్రతాధర్మములు, అనేకనీతులు, పతిభక్తి, ధర్మచింత దైవమునందును పతులయందును భక్తి మొదలగు యలవడును. ఈపాటలు చదివిన స్త్రీలనేకులు యీనూతనపాటలపుస్తకమును చాలా మెచ్చుకొనుచున్నారు. వలయువారు

సత్తిరాజుసీతారామయ్యగారు.

ఏలూరు గోదావరిజిల్లా అనివ్రాయవలె:

శ్రీ

# భామినీవిలాసము.

ఇది

పండితరాజబిరుదాంకితుఁ డగు జగన్నాథకవిచే

విరచిత మయిన సంస్కృతకావ్యమునుండి

రాజమహేంద్రవరమునందలి దొరతనమువారి

మొదటితరగతిబోధనాభ్యసనకళాశాలయందుఁ

బ్రధానాంధ్రోపాధ్యాయుఁ

డగు

వడ్డాదిసుబ్బారాయఁడు

తెలిఁగించినది.

ఇందుఁ గంగావిలాసమున నొక యనుబంధము కూడఁ జేర్చియున్నది.

మొదటికూర్పు 1000

(౦)

సత్తిరాజు సీతారామయ్యగారిచే

దేశోపకారముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది

ఏలూరు.

1903



వెల రు0-10-0

# పీఠిక.

---

సంస్కృతకవులచరిత్రమును సరిగాఁ దెలియఁజేయు సద్గ్రంథము లేదియు లేమి కాలమున భామినీవిలాసకృతికర్తయగు జగన్నాథపండితుని కాలనిర్ణయాదుల నించుమించుగాఁ దెలిసికొని, యాయనజీవచారిత్రమును గూర్చి యసంపూర్ణముగా నయిన విశ్వాసపాత్రమగు చరిత్రమును వ్రాయుట పఠనపరుల కెక్కింత సంతోషము గలుగఁజేయక పోదు. హిందూదేశమున బహుప్రాంతములయందుఁ గల్పనాకథ లెన్నియో యుత్పన్నములయి కాలక్రమమున దట్టముగా నల్లుకొని విజృంభించి, యొకానొకప్పు డెవ్వరేని నిజమయిన చారిత్రమును జెప్పినను దానియందు జనులకు నమ్మకము గుదురనీయనంత దృఢముగా వేళ్లుపాఱియున్నవి. ఇటీవల కాలములోఁ బ్రసిద్ధిఁ బొందిన జగన్నాథపండితుని చరిత్రముగూడ నట్టియసంగతపుఁ గట్టుకథలకు బుట్టినిల్లయినందున యథార్థము రూపుమాసినది. అయినను దత్పండితవర్యునిచే వ్రాయఁబడిన గ్రంథము లామూలాగ్రముగాఁ జదివి చూచితిమేని నిజమైన తచ్చారిత్రము గొంత సంపాదించుట దుర్లభము కాదు. జగన్నాథకవి గ్రంథరచనయందు విద్వద్బృందములో నెంతవన్నె కెక్కెనను నాయన విరచించినకబ్బములు మాత్రమంతగాఁ బ్రఖ్యాతిఁ బొందినవి కావు. అవి చదివినవారు కొందఱు మాత్రమే కలరు.

ఈపండితుని గుఱించి యనేకు లనేకవిధములుగాఁ గట్టుకథలను లోకమంతట వ్యాపింపఁ జేసిరి. సత్యాసత్యము లెట్లున్నను వినుటకు మాత్ర మవి మిక్కిలి మనోహరములు కాఁబట్టి యీయన జీవితమును గూర్చి చర్చింపక పూర్వ మాకథలయం దనేకులు చెప్పుకొను వాని నిట నుదాహరించుచున్నాఁడ.

(౧) జగన్నాథపండితుఁడు మిక్కిలి ప్రఖ్యాతికెక్కినవాఁడయి తనకుఁ గర్ణాటరాజ్యాధిపతులవలనఁ దగినంతసన్మానము గాని కలుగమిన, విత్తార్జనమున కుత్తరహిందూస్థానమునకు వెళ్లి జయపురపుసంస్థానమున ననేకపండితుల నోడించి యచ్చో శాస్త్రపరిశ్రమముకొఱకొక కొత్తయేర్పాటు గావించెను. ఆకాలమునందు డిల్లీసంస్థానమునందు విస్తారశాస్త్రపరిచయము గల ఖాజీ యొకఁడు హిందూమతగురువులను సంకటించి తాను వెళ్లినప్రదేశములందెల్ల మతవిషయికవాదములు జరపి విద్వాంసుల నోడించుచుఁ బ్రపంచమునందు మహమ్మదీయమతమే సత్యమతమని స్థాపించుచుండెను. ఈమత విషా

అట్లు నగుచుండఁగానే రసవంత మయిన యవన్యాశుకవనముచేత నానందపరవశుం డయి చక్రవర్తి కవిం జూచి నీయిచ్చ వచ్చిన దద్ది యేనిఁ గోరు మిచ్చెద ననియె. జగన్నాథకవి యంతమీఁద నాసుగతిని మరల నీక్రిందిశ్లోకములఁ జదివినాఁడు.

శ్లో॥ నయాచే గజాళిం నవా వాజిరాజిం
నవిత్తేషు చిత్తం మదీయం కదాచిత్
ఇయం సుస్తనీ మస్తకన్యస్తకుంభా
లవంగీ కురంగీ దృగంగీ కరోతు ॥

శ్లో॥ యవనీ నవనీతకోమలాంగీ । శయనీయే యది లభ్యతే కదాచిత్
అవనీతల మేవ సాధు మన్యే । నవనీ మాఘవనీ వినోదహేతుః ॥

భుజంగ॥ తురంగంబులం గోరఁ; దుంగేభసంఘా
దరం బొంద; యాచింప ద్రవ్యంబు; నేత
త్కురంగీదృశం, దోయకుంభోత్తమాంగన్
వరింతున్ లవంగిన్ నవప్రాయభంగిన్ ॥

కం॥ నవనీతమృదులతను సీ । యవనీమణి యున్న శయనమం దలనాఁ
డవనీతలమే మేల్ ; మా । ఘవని వని వినోదహేతుకం బని తలఁపన్ ॥

అని పలుకఁగాఁ దాను స్వప్నమందయినఁ దలంచుకోనియిట్టివిపరీతపుఁ గోరిక కాచక్రవర్తి యత్యద్భుతవిషాదగోచరుండయి తనవాగ్దానము దప్పలేక యప్పండితునితో నీవు మాతోఁ బొత్తున భుజించితివేని గన్యనిత్తునని యుత్తరంబిచ్చెను. జగన్నాథకవి లవంగికయందలి వ్యామోహంపుఁ బారవశ్యంబున జాతిబహిష్కరణమున కయిన వెనుకఁదీయక చక్రవర్తితో సహపంక్తిని నారగించెను.

(౩) ఈపండితుఁడు డిల్లీచక్రవర్తియాస్థానమున నున్నకాలములో వేఱొకమహారాజు తనసభయందు పండితుఁడుగా నుండుమని యీయన కొకజాబు వ్రాయఁగాఁ గవి దానికిఁ బ్రత్యుత్తరముగా నీక్రింది శ్లోకము లిఖియించి పంపెను.

శ్లో॥ దిల్లీశ్వరో వా జగదీశ్వరో వా
మనోరథాన్ పూరయితుం సమర్థః
అన్యైర్నృపాలైః పరిదీయమానం
శాకాయ వా స్యాల్లవణాయ వా స్యాత్ ॥

క॥ కోరికలను బూరించెడు । వారొకఁ డిల్లీశ్వరుండుఁ బరమేశ్వరుఁడే
భూరమణు లితరు లిడునది । కూరాకునకౌనొ యుప్పుకొ సరమౌనో ॥

(౪) జగన్నాథపండితుఁ డొకనాఁడు శారదాదేవి నారాధింపఁగా నాదేవి ప్రత్యక్షంబయి యీక్రింది శ్లోకముచే నాయనను నాశీర్వదించినది.

శ్లో॥ ఆసురుదేశం విచరేః మాకురు పరవాదినిర్జయే శంకామ్
స్వీకురు వరమేకం మే వ్యాకురు భోవత్స! శాస్త్రాణి॥

కం॥ ఆసురుదేశము దిరుగుము; । లేఁదువ పరవాదినిర్జితిం బోరయకు; నా
యేకవరంబును గైకొను; । వ్యాకృతి గావింపు శాస్త్రఘటితికి వత్సా ॥

(౫) ఆధునిక ప్రసిద్ధవైయాకరణుఁడైన నాగేశభట్టునకు నుపాధ్యాయుఁడగు హరిదీక్షితుఁడు చక్రవర్తికడ నెంతేని బహుమానము వడయఁ గోరి యొకప్పుడు డిల్లీ పట్టణమునకుఁ బోయి పాదుషాను సందర్శింపక మున్న పండితరాజును గలసికొని వ్యాకరణశాస్త్రమున నీతోఁ బ్రభుసన్నిధిని బ్రసంగింపఁ గోరుచున్నాననెను. అందుకు జగన్నాథకవి యంగీకరించి రేపు దర్బారునకు విచ్చేయుమని చెప్పెను గాని వ్యాకరణశాస్త్రమందు హరిదీక్షితుఁడు తనకంటె నధికుఁడని తెలిసినవాఁడుగాన మఱునటిదినమునఁ బానోక మంత్రపుఁగడియమును ధరించి సభకుఁబోయి యాక్రొత్త పండితుఁడు రాఁగానే యాయనను బ్రేమగలవానివలె గాఢముగాఁ గౌఁగలించుకొనెను. అందువలన వెంటనే యతనికొకవిధమయిన బుద్ధిమాంద్యముసంభవించి ప్రసంగారంభముననే హరిదీక్షితుఁడు పరిహాసాస్పదములయిన ప్రశ్నోత్తరములకు దిగినవాఁడయి తుదకు నలువురలో నవమానపడి యింటికిఁ బోయెను. ఆయన యంతటి పరాభవము రావలసినవాఁడు కాఁడు గావున నాతఁడెల్లఁ గన్నువోరయక విచారించి ప్రతివాదిజయమునకుఁ దగినసాధనము తనకు సమకూఱనియెడల నాఁటిరాత్రి ప్రాణత్యాగముఁ జేయువాఁడుగాఁ బ్రతిజ్ఞచేసికొని భక్తిపూర్వకముగా నిష్టదేవత నారాధింపఁగా నాదేవత యాతనిం దత్కాలకము దెలిపియూఱడించి ప్రతిక్రియను బ్రసాదించెను. మఱునాఁడు మరల నుభయపండితులు సభకుఁ విచ్చేసినప్పుడు మాయోపాయము పనిచేయనందున హరిదీక్షితునకే గెలుపుగలిగెను. అయినను దొలునాఁడు గెలిచినాఁడు గావునఁ బండితరాజు హరిదీక్షితునిచేఁ బరాజితుఁడు గాఁడని సభ్యులెల్ల నుద్ఘోషించిరి.

(౬) పండితరాజు తనపరువపుఁ బ్రాయమంతయు హాయిగా డిల్లీశ్వరుని సంస్థానమందు యవనవనితతో వెళ్ళఁబుచ్చి తుట్టతుదకుఁ దనచరిత్రనుగూర్చి పశ్చాత్తప్తుఁడయి తనయాయుశ్శేషము నక్కడఁ గడపవలయునని వారణాసికిం బోయెను. అప్పుడు శ్రోత్రియశ్రేష్ఠుండగు నప్పయదీక్షితుఁడు తత్పుణ్యక్షేత్రమునకు యాత్రవచ్చి యొక్కనాఁటిమధ్యాహ్నమునందు జగన్నాథకవిని జూడఁబోఁగా నతఁడాకాలమున యవన

యువతితో నేకశయ్యను బవ్వళించి కానఁబడిరి. అప్పయదీక్షితుఁడంత సకలవిస్మితుఁడయి తానాతని నెఱుఁగనట్లుగా నభినయించుచు నీక్రిందియర్ధశ్లోకమును జదివెను.

శ్లో॥ కిం నిశ్శంకం శేషే శేషే వయసః సమాగమతో మృత్యుః॥

తే॥గీ॥ ముగిసెఁ బ్రాయము మృత్యువు మెగిసె నకట!
మాట లే కిప్పుడా నిద్ర యోరిజీవ! ॥

అదివిని పండితరాజ శయ్యదిగి యప్పయ్యదీక్షితున కెదురువోయి తోడితెచ్చుచు శ్లోకార్ధమునీక్రింది విధమునఁ బూరించెను.

శ్లో॥ అథవా సుఖం శయీథా నికటే జాగర్తి జాహ్నవీ జననీ॥

తే॥గీ॥ అయినఁ గాదేమి నిదురింపు మాద మఱచి
కడను యున్నది తల్లి గంగాభవాని॥

(2) కాశీపట్టణములోని విద్వాంసు లందఱును జగన్నాథుని వ్యతిక్రమములను మన్నించి యాయనను కులములోఁ గలుపుకొనుటకు నిష్టపడిరి గాని తనకుఁ బ్రాణసమయైన లవంగిని దొలఁగుట కంగీకారము లేనందునఁ బండితులు చెప్పిన పద్ధతుల యందొద్దానికిని బండితరాజు సమ్మతించినాఁడు కాఁడు. యవనీసంపర్కము గలిగి యుండఁగా నీతనిఁ బునీతునిఁ జేయుట యనుకూలపడనందునఁ బండితరాజు చెప్పినపద్ధతులలో నెద్దానికిని బండితులును సమ్మతించినవారు కారు. అనంతర మొకనాఁడు జగన్నాథపండితుఁడు లవంగియుం దానుఁ గొండొక గంగాఘట్టమునందుఁ బయి మెట్టునఁ గూరుచుండి యా పవిత్రవాహినిని ధ్యానించి శ్లోకరూపముగా స్తోత్రము చేసెను. ఆఘట్టమున నేఁబది రెండు మెట్లు కట్టఁబడి యున్నవి. ఆశుధారను బండితరాజు చదివిన ప్రతి శ్లోకమునకును గంగాదేవి యుప్పొంగుచు శ్లోకమున కొక్కసోపానముగా నేఁబదిరెండు శ్లోకములకేఁబదిరెండు సోపానములును దాఁటి వచ్చి వారల నిరువురను దాఁకి పునీతులను గావించెను. వారిరువురు గంగలో మునింగి యదృశ్యులయిరనియుఁ జెప్పుట గలదు. పండితరాజు రచియించిన యాయేఁబదిరెండుశ్లోకములస్తోత్రము గంగాలహరి యనుపేరితో హిందూదేశమందంతట సాధారణముగాఁ బాఠము చేయఁబడుచున్నది.

జగన్నాథపండితునిఁగూర్చి పూర్వోక్తప్రకారమున ననేక కథలు లోకమంతట వ్యాపించియున్నవి. అయినను వాని నున్నవిధమున నమ్ముటకుఁ గొన్నిచోట్ల నవకాశము లేదు; కావున నం దెంతవఱకు సత్యమున్నదో విచారింతము. ముందుముందు వెల్లడి కాఁగల యీయనతండ్రిగారి పేరినిబట్టియు, నాడీభేదమును బట్టియు మఱికొన్నియితరాంశములనుబట్టియుం జూడఁగా నీపండితుఁడు మనగోదావరిమండలమువాఁడనియుఁ జిరకా

లముత్తరహిందూస్థానమున వసించినాఁడనియు రూఢమగుచున్నది. పారసీ భాషయందీయనకు విశేషప్రవేశము గలదన్నమాట నమ్మవచ్చును. సగము సంస్కృతముతోను సగము పారసితోను నీయనరచియించిన శ్లోకము లనేకము లున్నవనియు విశేషించి పారసి భాషయందలి యొకానొక జ్యోతిశ్శాస్త్రగ్రంథమును సంస్కృతములోనికీయన మార్చినాఁడనియుఁ జెప్పుచున్నారు. ఈ భామినీవిలాసము కడపట, నీయనపూర్వవయస్సంతయు ఢిల్లీచక్రవర్తియాస్థానమునఁ గడపినట్లు తెలియ వచ్చుచున్నది గాన, సంస్కృత భాషాపోషకు లని ప్రసిద్ధిగాంచిన పాదుషాలలో నెవరో యీయనయందు విశేషాభిమానము వహించియుండవచ్చును.

రెండవప్రవాద మక్బరుచక్రవర్తితో సంబంధము కలిగి యున్నది. ఆ చక్రవర్తిని గూర్చి యేస్వల్పాంశమును గూడ విడువకుండ వ్రాసిన ‘‘ ఐయినయక్బరీ ’’ యనుచరిత్రములో నీపండితుని ప్రశంసగాని లవంగికసంగతిగాని గానరాదు. మహమ్మదీయుఁ డయివ యక్బరుచక్రవర్తి తనకొమార్తె నొకవైదికబ్రాహ్మణునకిచ్చి పెండ్లి చేసెనమాటయే నిజమైనపక్షమునకుఁ దచ్చరిత్రములో గ్రువ్వవలసినవిషయరత్నములయందింతకు మించిన విలువగలది చరిత్రకారునకు వే ఱొకటి యుండ దని నిశ్చయముగా వక్కాణింప వచ్చును. మఱియు మిగుల మీఱిన రాణీవాసముగల మొగలాయిచక్రవర్తి కూఁతురు జల కలశమును దలమీఁదఁ బెట్టుకొని కొలువుకూటములోనికి వచ్చినదని చెప్పుమాటయందు వివేకముగలవారి కెవ్వరికి విశ్వాసము పుట్టును? మహమ్మదీయ ప్రభువులలో హిందువులకు మిగుల ననుకూలుఁ డయినవాఁడును వారిచే నెచ్చుగ మెచ్చఁ బడినవాఁడును నక్బరు చక్రవర్తి గావునఁ దమకుఁ బరిచిత మయినపేరు, పండితరాజు నాదరించిన చక్రవర్తికి మనవారారోపించి యుందురు. ఇంతియ కాని యీపండితునకును నక్బరు చక్రవర్తికిని లేశమును సంబంధము లేదు. యీకథలో నటికి యున్న శ్లోకములు పండితరాజు రచియించిన యే గ్రంథము నందును గానరావని తత్కర్తృత్వ మీకవియందు నునుచుట నొకానొక రనుమానించుచున్నారు; కాని వారి కట్టియనుమానము పుట్టవలసినపని లేదు. చాటుధారా శ్లోకములు లోకమందే పాత్రికి యుండును గాని గ్రంథములయం దెప్పుడు నిమిడి యుండవు.

విమర్శించి చూడఁగా నీకథ యంతయుఁ గేవల కల్పిత మని చెప్పుటకంటెఁ గాసంత లేనిదీ గంపంత కాదనులోకోక్తిని బట్టి జగన్నాథ పండితునకు యవనీ సహవాస మున్న దనియే తలంచుట మంచిది గాఁ దోఁచుచున్నది. ఈ భామినీవిలాసమందలి కరుణావిలాసము సర్వము నీకవికిఁ దటస్థించిన జాయావియోగదుఃఖమునే ప్రకటించుచున్నది గదా! మహమ్మదీయ చక్రవర్తిగారి దివాణము నాశ్రయించి యున్న యీ

మూఁడవకథ జగన్నాథ పండితుని ప్రభుభక్తిని సూచించుచున్నది. కనుక నద్దానిని విశ్వసించుటకుఁ బ్రమాణాంతర మనావశ్యకము.

నాలుగయిదు కథలు పేరుపాదయున కందక కేవల విశ్వాసముమీఁద వ్రేలాడుచున్నవి. దేవతాసాక్షాత్కారాదులయందు నమ్మకము గలవారే కాని లేనివారు వానినంతగాఁ బాటి సేయరు. ఈ రెంటిలోఁ గడపటి దానియందు నాగేశభట్టునొక నామము వినఁబడుచున్నది. నాగేశభట్టునతఁడు జగన్నాథపండితవిరచిత మయినరసగంగాధర మనునలంకారశాస్త్రమునకు గురుమర్మప్రకాశ మను వ్యాఖ్యానము చేసియున్నాఁడు. ఆవ్యాఖ్యానము పేరిఁబట్టి యాలోచింపఁగా నాగేశభట్టునతఁడు హరదీక్షితునకుఁ గాక జగన్నాథపండితునకే శిష్యుఁడేమోయని తోఁచుచున్నదిగాని తద్వ్యాఖ్యానముఖశ్లోకమున "నత్వాగంగాధరం మర్మప్రకాశం తనుతే గురుః" మ్మనియున్నందున నందులకు మరల సందేహముగలుగుచున్నది హరదీక్షితాదులకాలనిర్ణయమును గుఱించి ముంబాపురప్రకటితసంస్కృతభామినీ విలాసమునందలి యాంగ్లోభాషాలిఖిత పీఠికయందు నధికముగా వివరింపఁబడి యున్నది. వలయువా రందుఁ జూచుకొనునది.

ఆఱవకథవిషయమున—

శా. జల్లించెం గడకేళ్ళ శాస్త్రములు; నిష్కర్ష సల్పె నిత్యక్రియల్;
ఢిల్లీవల్లభపాణిపల్లవమునన్ లేఁబ్రాయముంచెన్; గడున్
దుల్లన్ వాసన లిర్యెడన్ మధురయందుం గొల్చు గోవిందు; హా
యుల్లోకంబులఁ జేసెఁ బండితసమూహోత్తంసుఁ డన్నింటినిన్ ॥

అను భామినీచతుర్థవిలాసపద్యమునందుఁ బండితరాజు తనయంత్యదినములను మధురయందుఁ గడపినట్లు కనఁబడుచున్నను వారణాసియందు వసియించినాఁడని చెప్పుటకుఁగూడఁ గారణమున్నది. క్రీ. శ. 1697సం॥ ప్రాంతమున సుప్రసిద్ధుఁడైయున్నట్లు తెంచఁబడిన ద్రవిడపండితుఁ డప్పయ్యదీక్షితుఁడు పండితరాజునకన్యాలముసఁబ్రతిపక్షిగ నున్నవాఁడు "నేదం రూపకం, రూపకేచ బింబప్రతిబింబభావో నాస్తీతికేనాప్యాలంకారికంమన్యేనప్రతారితస్యాగ్నిరత్రశవసఙక్తి రత్రశ్రద్ధేయైన". అని రసగంగాధరరూపక ప్రకరణము. దీక్షితశ్చాలంబకత్వస్యద్రవిడ స్యాప్పదీక్షితస్య అని పయివాక్యములోనిమాటకు నాగేశభట్టువ్యాఖ్యానము. పండితరాజున కప్పయ్యదీక్షితుఁడు ప్ర

తిపక్షియనుటకుఁ బూర్వోక్తసంస్కృతి వాక్యమే సాక్షి. ఇట్టిస్థితిలో నీపండితు లిరువురును గథలోఁ జెప్పఁబడిన చొప్పున నెప్పుడయినఁ గలసికొనిరాయను విషయమే పరమసందిగ్ధము. ఇంక శ్లో॥ కిం నిశ్శంకం శేషే (ముగిసెఁబ్రియము ఇత్యాదిదాని తెలుఁగు) అను నార్యను వారిద్దఱును గలిసి చెఱిసగము రచియించిరను విషయము చెప్పవలసినదేమి? ఇంతియగాక యీశ్లోకము రసగంగాధరమున నాక్షేపప్రకరణమునందును గానవచ్చుచున్నది. దీనం జేసి తదార్యయం దప్పయ్యదీక్షితునకు భాగమీయ బొత్తిగ నే వలనుపడదు. ఏమనఁగా జగన్నాథపండితుఁడు తనరసగంగాధరమునందు.

శ్లో॥ నిర్మాయ నూతన ముదాహరణానురూపం
కావ్యం మయాత్ర నిహితం న పరస్య కించిత్ ;
ఆఘ్రాయతే సుమనసాం మనసాపి గంధః
కస్తూరికాజననశక్తిమతా మృగేణ ॥

దీనికిఁ దెలుఁగు

చ॥ కొననిటఁ గొంచెమేనియు నొకొండు రచించిన దాని; నేనె నూ
తనముగఁ జేసి యుంచితి నుదాహరణాను గుణంబుఁ గావ్యముల్ ;
మనసున నైన మూర్కొను నా సుమనస్సుల తావిఁ గస్తురిం
జననము నొందఁ జేయఁగను జాలుమృగంబు జగంబులోపలన్ ॥

అని గొప్పప్రతిజ్ఞ చేసికొన్నాఁడు. కంఠోక్తిగాఁ దెలియవచ్చుచున్న యీప్రతినకు విరుద్ధముగాఁ బుక్కిటిపురాణమును విశ్వసించుట వివేకపక్షము గాదు.

కడపటికథయందుఁ బర్యవసానము రెండంశములుగాఁ దేలుచున్నది మొదటిది జగన్నాథపండితుఁడు జాతిబహిష్కృతుఁడయ్యె ననుట. రెండవది గంగాస్తవము గావించి యావెంటనే లవంగితోడ నాతఁడు గంగలో మునింగి యదృశ్యుఁడయ్యె ననుట. ప్రథమాంశమును గుఱించి కొందఱయభిప్రాయ మేమనఁగా గంగాలహరియందలి కొన్ని శ్లోకములు ముఖ్యముగా ౬, ౨౫, ౩౦, ౩౬, ౩౮, ౩౯, ౪౬, ౪౮ సంఖ్యలు గలవి, లిఖ్కథను మెలుఁగువెట్టునట్లు కనఁబడుచున్నవిగాని యవియొక ప్రమాణముగానేరవు. అంతకన్నను దీనముగా ననేకకవులు స్తవములను జేసియున్నారు. అనుసరిగా నున్నది. అయినను.

చ॥ భవ మనుపాఁడునూతఁబడి బాముల నొందెడు నన్ను నీగతిం

దనృజ్ఞ యుపేక్ష సేయఁ గరుణావరుణాలయ! శౌరి! తొల్లినీ
వచన మొనర్చ వెట్టు లకటా! ప్రకటాఘును బింగళాఖ్యవా
రవనిత, దుష్టవర్తనుని భ్రష్టు నజామిళభూసురబ్రువున్ ॥

భామి. శాంత. ౧౨.

అను నర్థముగల మూలశ్లోకమును జదువునప్పుడు తత్కృతి కర్తను దనలవంగికా సంభోగమును క్షమియించుమని భగవంతుని గూర్చి మొఱపెట్టుకొనినట్లు తెవరు తలంపకుందురు? ఇట్టి ప్రార్థనము చేసెఁగరిని మనము వినము. ద్వితీయాంశము కేవలము విశ్వాసానర్హముగానున్నది. కొందఱు చెప్పెడులాగునఁ బండితరాజు నిజముగా గంగాలహరి రచియించిన తోడనే గంగాప్రవేశ మయిన పక్షమునఁ దదనంతర మాయన వేఱొక గ్రంథము విరచించుట కవకాశము గలుగదు గదా! ఈక్రింది యంశమును బట్టి విచారింపఁగా గంగాలహరికిఁ దరువాత నాయన తనకృతుల నన్నిట నుత్కృష్టతమ మనఁదగిన రసగంగాధర మను నలంకారశాస్త్రమును విరచించి నట్లు కనుపట్టుచున్నది. ఆగ్రంథమునం దన్వయప్రకరణమున.

ఉదాహరణ మమృతలహర్యాఖ్యే మదీయే గంగాస్తవే—

శ్లో॥ కృతక్షుద్రాఘౌఘా నథ సపది సంతప్తమనసః
సముద్ధర్తుం సంతి త్రిభువనతలే తీర్థనివహాః
అపి ప్రాయశ్చిత్త ప్రసరణపథాతీతచరితా
న్నరా నూరీకర్తుం త్వమివ జనని త్వం విజయసే॥

(పైసంస్కృతమునకుఁ దెలుఁగు)

మదీయ మగునమృతలహర్యాఖ్య గంగాస్తవమునం దుదాహరణ మని

చ॥ పొనరిచి ఘోరపాతక సమూహము లుమ్మలికించు వారలన్
మనుపఁగ నున్న వెన్నొ భువనత్రితయంబునఁ దీర్థసార్థముల్;
జనని నిరో! నీకు నీవెకుమి సాటి విష్కృతిమార్గదూరవ
ర్తనములు గల్గుమర్త్యసముదాయము నైనను నుద్ధరింపఁగన్॥

అనునర్థమిచ్చుపయిశ్లోకమును జేర్చియున్నాఁడు. గంగాస్తవమునందుఁ గడపటిదయిన

శ్లో॥ ఇమాం పీయూషలహరీం జగన్నాథేన నిర్మితాం

యః పఠేత్సప్తసర్గస్య జాయంతే సుఖసంపదః॥

అనుశ్లోకమునందుఁ జెప్పఁబడినచొప్పునఁ దద్గ్రంథమును పీయూషలహరియనవ లసియుండఁగా నీయనన్వయప్రకరణమున 'నమృతలహర్యాఖ్యే'యని యుండుట లేఖకా ప్రమాదముగాఁ దలంప నయ్యెడిని. పండితరాజు రచియించినది యమృతలహరియని వే ఱొకటి యున్నది. అదియమునాస్తవముగాని గంగాస్తవముగాదు. ఉదాహృతశ్లోకము గంగాస్తవమునందుఁ గానఁబడుచున్నది. పీయూషలహరిలోని ప్రతిశ్లోకమునకును గంగ యుపాస్యంగుచు వచ్చినను మాట తల్లహరిమాధుర్యాతిశయ ద్యోతకమగు నత్యుక్తిగా విద త్తులు భావించుకొందురుగాక.

కథలవిషయ మిట్లు ముగిసినది గనుక నటుమీఁదటఁ గాలనిర్ణయము చేయవలసి యున్నది. అందును గుఱించి నిర్వివాదముగా నిశ్చితాభిప్రాయ మిచ్చుటకు జగన్నాథ పండితుఁగు రచియించిన గద్యపద్యములే సిద్ధముగానున్నవి. కాఁబట్టి వానిని క్రిందవ్రాయుచున్నాను.

౧ శ్లో॥ సురాంగనా మారామా విహర్తుమితి ఘుంఘూనిలహతాః
పతేయుః శాఖీంద్రా యది తదఖిలో వందతి జనః
కిమేభిర్వ్యాకార్యం కవిశవ వివేకేనవికలై
ర్ధీరంజీవన్నాస్తా మతిధరణి ఢిల్లీనరపతిః॥

రసగంగాధరము. ఆక్షేపప్రకరణము.

౨ శ్లో॥ సృష్టస్సృష్టిపృతా పురాకిల పరిత్రాతుం జగన్మండలం
త్వం చండాతప నిర్దయం దహసి యజ్జ్వాలాజటాలైః కరైః
సంరంభారుణలోచనో రణభువి ప్రస్థాతుకామోఘనా
జానీమో భవతా సహాంతర విదితో ఢిల్లీధరావల్లభః॥ ర. గం. ప్రతీపప్రకరణము.

౩ శ్లో॥ మాహాత్మ్యస్య పరోవధి ర్నిజగృహం గంభీరతాయాః పితా
రత్నానా మహమేక ఏవ భువనే కోవాపరో మాదృశః
ఇత్యేవం పరిచింత్యమాస్మ సహసా గర్వాంధకారం గమో
దుగ్ధాబ్ధే భవతా సమో విజయతే ఢిల్లీధరావల్లభః॥ ర. గం. ప్రతీపప్రకరణము

౪ శ్లో॥ అనుకూలభావ మథవా పరాఙ్ముఖత్వం సమాహితవరలోకే
అన్యోన్యావిహితమంత్రౌ విధిదిల్లీవల్లభౌ వహతః॥ ర. గం. సహోక్తిప్రకరణము

౫. గ॥ మూర్తిమతేవ నవాభ్యాసఫలానాం ప్రసాదేన ద్విజకులసేవాహేవాకినా జ్ఞానకాయేన మాథురకులసముద్రేందునా రాయముకుందేనాదిష్టేన సార్వభౌమ శ్రీశాహజహాం ప్రసాదాధిగతపండితరాజపదవీవిరాజితేన తైలింగకులావతంసేన పండిత జగన్నాథేనాసఫవిలాసాఖ్యేయ మాఖ్యాయికా నిరమాయత. ఆసఫవిలాసపీఠిక.

౨ శ్లో॥ శ్యామం యజ్ఞోపవీతం తవ కిమితి మషీసంగమాత్కృత్రిమాత్
సోయం శీతాంశుకన్యాపయసి కథమభూదుజ్జ్వలం కజ్జలాక్తం
వ్యాకుర్వన్నారసేన క్షితిరమణ రిపుక్షోణిభృత్పక్ష్మలాక్షీ
లక్షాక్షీణాశ్రుధారాసముదితసరితాం సర్వతస్సంగమేన॥ ఉత్తరప్రకరణము

౩ శ్లో॥ భూమీనాథ శహాబుదీన భవతస్తుల్యో గుణానాం గణై
రేతద్భ్రాత భవప్రపంచవిషయే నాస్తీతి కిం బ్రూమహే
ధాతా నూతనకారణైర్యది పునస్సృష్టిం నవాం భావయే
న్నస్యాదేవ తథాపి తావకతులాలేశం కథానో వరః॥ అసఫప్రకరణము

పై సంస్కృతమునకుఁ దెలుఁగు

౧ మ॥ అమరారామమునుండి క్రిందఁబడఁగా నత్యుగ్రఝంఝామారుత
ద్రుమరాజంబులు సంతసింతురు జనుల్ తోరంబుగా; నైన లా
ఘమదేమీ యకటా! వివేకవికలత్వంబొందునవ్వానిచేఁ
త్తను ఢిల్లీనరనాథచంద్రుఁ డెలమిన్ జైవాతృకుండయ్యెడిన్॥

౨ శా॥ పాలింపం గదరా ధరావలయమున్ భానూ! నినుం జేసెన
న్నాళీకాసనుఁ డేత్తు నిర్దయతఁ జండత్వోత్కరజ్వాల; ను
ద్వేలాటోపత రక్తనేత్రుఁ డగుచుం ఢిల్లీక్షమావల్లభుం
డాలంపుంరమి భైలుదేఱు నను టీవాలింప వేమో కటా॥

3 శా॥ మాహాత్మ్యంబున కెల్ల; లోఁతునకు ధామంబున్, బి న్రత్నసం
దోహంబంతకు; మాన్యుఁడు జగమంతుం గల్గునే యన్యుఁ డం
చాహం జేయుచు దర్పదాంధుఁ డవు గా క్షీరవారాశి; ఢి
ల్లీహాంపీరవతంస మన్నట భవల్లీలన్ బ్రవర్ధిల్లెడున్॥

౪ క॥ ఢిల్లీవల్లభుఁడును విధి యొల్లపు నన్యోన్య మతి విహితమంత్రిత వ

హాను రాజ్యము చేసినది ౩౦ ది సంవత్సరములు. ఆకాలమంతయు నీయన తదాస్థానమునం డుండి, యారంగజేబు (షాజహానుని తృతీయపుత్రుఁడు) తనతండ్రిని చెఱపెట్టిన కాలమునో యన్నయగుదారాను సంహరించిన కాలమునో తన్నాదరించుమంచిప్రభువు లేక పోవుటచేత వార్ధకమున మధురయందు గోవింద సన్నిధానమున దినములు వెళ్ళఁబుచ్చి యుండును. రసగంగాధరము చేసిన కాలము షాజహానుని ప్రభుత్వమధ్యమునందలిదై యుండ కావచ్చును. కావునఁ దద్గ్రంథముకంటెఁ బూర్వప్రతియగు గంగాలహరి రచియించునప్పు టికిఁ బండితరాజు ముసలి యయి యుండఁడుగాని "ముగిసెఁ బ్రాయము మృత్యువు మొ గిసె" నర్థమిచ్చు శ్లోకమునుబట్టి చూడఁగా "గాఢ్యాంతు మరణావస్థ" యను వచనము ననుసరించి యవసానమునకు నతఁడు వారణాసిఁ బ్రవేశించి యుండు నేమో యను సయూహ తోఁచుచున్నది. పండితరాజు జహాంగీరునికడపటి కాలముననే దరాస్థానమునఁజే రియుండుననుకొన్నను దత్పుత్రుఁడగు షాజహానురాజ్యాంతమునప్పటి కాయన కెనిమిద వపది సమీపించి యుండవలసివచ్చును. ఇట్టిస్థితిలో షాజహాను పితామహుఁడగు నక్బ రు చక్రవర్తికడ నీయన పండితుఁడుగా నుండెననుమాట యెట్లుపొసఁగును? భామి.శాం. ౬౪ శ్లోకమునందు "దిల్లీవల్లభపాణిపల్లవతలే నీతం నవీనం వయః" యని తన యావత్ప్రా యమును దిల్లీశ్వరుని కిచ్చినట్లు కంఠోక్తిని చెప్పుచున్నాఁడు. ఈదిల్లీశ్వరుఁడక్బరుచక్రవ ర్తియేయై యతనిపాణియందే పరిపూర్ణసకలశాస్త్రపాండిత్యాతిశయ సంపాదనాంతర స్వీయనవీనప్రాయం బీయనచేత నీతమయిన పక్షమునందు నక్బరుమీఁదఁ బండితరాజు చెప్పిన శ్లోక మొక్కటియైన లేక పోవుటయు షాజహాను మీఁదఁ జెప్పిన వనేకము లుండుటయుఁ బైగా నీకడపటిచక్రవర్తిచేతనే యతనికిఁ బండితరాజబిరుద మీయఁబ డుటయు నెట్లు సంభవించును? పూర్వోక్తప్రకారమున ముత్తరములచక్రవర్తి సంఖ్య లమీఁదనే కాక షాజహానుని కేలాగునను సంబంధముగలపినవాఁడగు నాసఫఖానుమీఁ దఁగూడ నొకయాఖ్యాయిక పండితరాజు రచియించినట్లు చదివియుంటిమిగదా! అక్బ రుకాలమున నీపండితుఁడున్నయెడల నాయన వర్ణన మీయన చేయకుండుట సర్వథా య సంభవము. కాఁబట్టి రసగంగాధరమునందుండి పైనుదాహరించిన ౧,౨,౩,౪, శ్లోకముల లోఁ జెప్పఁబడిన దిల్లీవల్లభుఁడు నిశ్చయముగా షాజహానే కాని వేఱొకరు కారు. త త్కారణముచేఁ బండిత జగన్నాథునిమహోచ్ఛ్రాయదశ క్రీ.శ. ౧౬౨౦ మొదలుగాని ౧౬౬౦ సం॥ నఱకు నైయుండవచ్చును.

జగన్నాథపండితుని తండ్రిగారిపేరు పేరుభట్టనియుఁ దల్లిపేరు లక్ష్మియనియు నీయన తెలుఁగునాఁటివాఁడనియు సకలశాస్త్రపారంగుఁడగు జనకునియొద్దనే విద్యల న్నియు నభ్యసించెననియు నీక్రిందిశ్లోకముల వలనఁ దెలియవచ్చెడును.

౧ శ్లో॥ తైలింగాన్వయ మంగళాలయమహాలక్ష్మీదయాలాలితః
శ్రీమత్పేరమభట్టసూను రనిశం విద్వల్లలాటంతపః
సంతుష్టః కమఠాధిపస్య కవితా మాకర్ణ్య తద్వర్ణనం
శ్రీమత్పండితరాజపండితజగన్నాథో వ్యధాసీదిదమ్ ॥ ప్రాణాభరణము ౫౨

౨ శ్లో॥ పాషాణాదపి పీయూషం స్యందతే యస్య లీలయా
తం వందే పేరుభట్టాఖ్యం లక్ష్మీకాంతం మహాగురుమ్॥ ర. గం. పీఠిక.

౩ శ్లో॥ శ్రీమజ్జ్ఞానేంద్రభిక్షో రధిగతసకలబ్రహ్మవిద్యాప్రపంచః
కాణాదీ రాక్షపాదీ రపి గహనగిరో యో మహేంద్రాద్రవేదీత్
దేవాదేవాధ్యగీష్ట స్మరహరనగరే శాసనం జైమినీయం
శేషాంకప్రాప్తశేషామలభణితి రభూత్సర్వవిద్యాధరో యః॥ ర గం. పీఠిక

పీఠికఁ దెలుఁగు.

౧ మ॥ శ్రితలక్ష్మీకరుణోపలాలితుఁడుఁ బేరంభట్టసూనుండుఁ బం
డితరాజాంకుఁడు నాంధ్రలింగకులుఁడున్ విద్వల్లలాటంతపుం
డతితుష్టిన్ విని కామరూపవిభు నిద్ధంబౌ కవిత్వంబుఁ, గ
ద్భవు వర్ణించుచుఁ జేసెఁ బండితజగన్నాథుండు దా నీకృతిన్ ॥

౨ క॥ పాషాణమునుండియుఁ బీ । యూషము స్రవియించు నే బుధోత్తము లీలన్,
భూషించుచు నా లక్ష్మీ । యోషావిభుఁ బేరుభట్టు నొజ్జను దలఁతున్ ॥

౩ మ॥ గ్రహియించెన్ నుతబ్రహ్మవిద్య విమలజ్ఞానేంద్రయోగీంద్రుచే,
గహనం బైన కణాదగౌతములవాక్యంబుల్ మహేంద్రార్యుచే,
మిహికాళీపురి ఖండదేవువలనన్ మీమాంస, శేషాంకుచే
నహిరాడ్భాష్యముఁ; బేరుభట్టఖిలవిద్యాశాలి సామాన్యుఁడే ॥

మఱియు జగన్నాథపండితుఁడు రాజమహేంద్రవరమండల నివాసి యని తద్వంశ్యుఁడగు నొక కాశీపండితుఁడు వ్రాసియున్నాఁడు. పండితరాజుతండ్రి పేరుభట్టు గదా! అన్యదేశీయున కిట్టిపేరు సాధారణముగా నుండనేరదు. కాఁబట్టి యాకాశీపండితుఁడు వ్రాసినమాట నిజమే కావచ్చును. జగన్నాథపండిత విరచితములయిన గ్రంథములనుగుఱించి కూడఁ గొంచెము వివరించి యీపీఠిక ముగించుచున్నాను.

ఈయన గంగను, యమునను, లక్ష్మిని, విష్ణువును, సూర్యుని స్తోత్రము చేయుచు వరుసగా, ౫౨, ౧౦, ౪౧, ౬౦, ౩౦ శ్లోకములుగల పీయూషలహరి, యమృతలహరి, లక్ష్మీలహరి, కరుణాలహరి, సుధాలహరియని పంచలహరులను రచియించినాఁడు. వీని లోఁ బీయూషలహరిని గంగాలహరియని సాధారణముగా వ్యవహరింతురు. సుధాలహరి యనునది మయూరకవిరచిత సూర్యశతకమువలె ప్రస్ఫురద్వృత్తములు గలిగి యున్నది.

రసగంగాధరము. ఇదియొకయలంకారశాస్త్రము. జగన్నాథపండితుఁడు రచియించినగ్రంథములం దన్నిట నిది యుత్తమము. సరస సాహిత్యసంపాదనాభిలాషులకి ది యవశ్యపఠనీయము. మనీషులు దీనిని గవి కల్పకమని సన్నుతింతురు.

మనోరమాకుచమర్దన. ఇది భట్టోజిదీక్షితుఁడు సిద్ధాంతకౌముదికిఁ జేసిన మనోరమ యనువ్యాఖ్యమీఁద ఖండనగ్రంథము.

అశ్వధాటి. ఇది తనమనుమని ప్రార్థనమునఁ గవి రచియించిన ట్లీ క్రిందిశ్లోకమువలనఁ దెలియవచ్చుచున్నది. శ్లో॥ రామనామ్నః స్వపౌత్రస్య కామనాపూరణోత్సుకః । అశ్వధాటీం జగన్నాథో విశ్వహృద్యా మకీరచత్ ॥ ఇది యమకప్రధానములగు ౨౫ శ్లోకములు గల బహుదేవతాస్తవ గ్రంథము అశ్వధాటీవృత్తములనుబట్టి దీనికాపేరు పెట్టఁబడినది.

ప్రాణాభరణము. ఇదికామరూపదేశాధీశ్వరుఁ డైన ప్రాణనారాయణుని పరాక్రమాదులను వర్ణించుచు రచియించిన చిన్నగ్రంథము ఇందలిశ్లోక మొకటి యీయిటలోఁ దెలుఁగుపద్యముతోఁ గూడ నీపీఠికలో నే వ్రాయఁబడియున్నది. అది చదివిచూడఁగా నీగ్రంథముఁ గామరూపాధిపునికవిత్వమున కలరి పండితరాజు రచియించినట్లు గోచరించెడును. ఈగ్రంథమందలి మొదలిశ్లోకము భామినీవిలాసమందలి ౯౨ శ్లోకము నొక్కటిగానున్నది.

జగదాభరణము. ఇది షాజహానుజ్యేష్ఠపుత్రుఁ డగుదారాసుకాను వర్ణించుచుఁ గవి రచియించినది. దారా సంస్కృతభాషాపోషకుఁ డగుట సుప్రసిద్ధము.

ఆసఫవిలాసము. ఇది కేవలగద్యకావ్యము. కవి దీని నాసఫఖానను నవాబునునూ ర్చిరచియించినాఁడు. ఈసంగతి స్పష్టపఱుచునొక వాక్యము తద్గ్రంథపీఠికలోని దని యింతకుఁబూర్వ మీపీఠికలో నే యుదాహరింపఁబడియున్నది.

భామినీవిలాసము. ఇది భర్తృహరివిరచితమైన సుభాషితరత్నావళివంటిది. ఇందు నానారసప్రధానములయిన మనోజ్ఞశ్లోకములు గలవు. జగన్నాథపండితుఁడు తన రసగంగాధరములో లక్ష్యములుగా నుదాహరించుకొనుట కీగ్రంథము రచియించినాఁడ నియు, గంగాలహరిప్రముఖనిజగ్రంథములలో దొరకనిలక్ష్యముల నిందుండి గ్రహించుచు వచ్చెనియుఁ జెప్పుదురు. రచనాకారణము నెవరేమి చెప్పినను గ్రంథముమాత్రము

సరసమైనది ఇందలి శ్లోకము లలంకారాదులకు లక్ష్యములుగావున వీనిని జదువుటవలనఁ దత్తద్విషయములు స్ఫురణకు వచ్చుచుండును.

ఇదిగాక చిత్రమీమాంసాఖండనము మొదలుగాఁగలబహుగ్రంథము లీపండితరాజు రచియించెనని చెప్పెదరు. వసుమతీపరిణయము రతిమన్మథము ననురెండు నాటకములు గలవు వానినిరచియించిన కవి జగన్నాథుఁడని యందున్నదిగాని యాజగన్నాథుఁ డీజగన్నాథుఁడు గాఁడని నిశ్చయముగాఁ దలంపవచ్చును. తన్నాటక ప్రస్తావనలయందుఁ గవి తండ్రిపేరు బాలకృష్ణుఁడని యుండుటయేగాక విశేషించి వసుమతీపరిణయమందుఁ దన్నాటకమప్పుడు రాజ్యముచేయుచున్న పిష్వబాలాజిబాజిరాయనియాజ్ఞచొప్పున రచియించినట్లు చెప్పఁబడినది. ఇందువలన నీనాటక ద్వయకర్తయగు జగన్నాథుఁడు బాలాజి బాజిరాయని కాలమందనఁగా 18 వ శతాబ్దము నడుమ నున్నవాఁడని తేలుచున్నది. భామినీవిలాసకర్త 17 వ శతాబ్దము నడిమివాఁడనియు నతని తండ్రిపేరు పేరుభట్టనియుఁ బూర్వమే తెలుపఁబడెను గదా !

భామినీవిలాసమందలి కవపటిపద్యములవలన జగన్నాథ పండితుఁ డాత్మస్తుతిపరాయణుఁడని స్థూలదృష్టిచేఁ దోఁచునుగాని సూక్ష్మదృష్టి నాలోచించినచో సర్వశాస్త్రకూలంకష ప్రజ్ఞగల యవ్విద్వాంసునకట్టి యుత్కర్ష మతిశయోక్తిగాదని తోఁచనే స్ఫురియింపకపోదు పండితరాజు తనకవనమందుఁ బ్రసాదముసాధారణగుణమని యాక్రింది వాక్యమువలనఁ జెప్పియున్నాఁడు. " శ్రోత్రమాత్రే వాక్యార్థం కరతలబదరమివ నివేదయంతీ ఘటనాప్రసాదస్య. అయం చ సర్వసాధారణో గుణః, ఉదాహరణాన్యత్ర ప్రాయశో మదీయాని సర్వాణిపద్యాని. " ర. గం - ఆననము ౧. ఇట్టికవనమును సరిగఁ దెలిగించుట యశక్యమే యయినను మనీషులు గుణగ్రాహులను నమ్మికతో నేనీ ప్రయత్నమును జేసినాఁడను జగన్నాథపండితుని గురించి కొంతవివరముగా వ్రాయుటకై నాకు, ఎల్, ఆర్, వైద్యులువారు ౧౮౮౭ సం॥ ప్రకటించిన సంస్కృత భామినీవిలాసములోని యాంగ్లోపీఠిక విశేషసాహాయ్యము చేసినందునఁ దత్పండితులకు నేను మిగులఁ గృతజ్ఞుఁడనగుచున్నాను.

ఎన్నఁడో నాయొద్ద నేర్చుకొన్న కొంచెపాటి తెలుఁగునకై సదా నాయెడల శుభభావము వహించి యీగ్రంథము ముద్రితప్రతి గయికొనకయే యచ్చొత్తించిన దేశోపకారి పత్రికాధిపతి సత్తిరాజు సీతారామయ ప్రధానునిఁ బరమేశ్వరుఁ డాయురారోగ్యాది సంపన్నునిఁ జేయుఁగాక యని కోరుచున్నాఁడను.

రాజమహేంద్రవరము.
1902 సం॥ డిసెంబరు.

వడ్డాదిసుబ్బారాయఁడు.

## అవతారిక.

---

సతీస్మృతి యనఁగాఁ బతివ్రతను గూర్చిన స్మరణము. వేణీసంహారాద్యాంధ్ర గ్రంథకర్త యయిన వడ్డాది సుబ్బారాయకవి తనభార్య యగు నన్నపూర్ణాసతిచరమకాలమునఁ దజ్ఞాపకముగా దీనిని రచియించినాఁడు. పండితరాయ లనుబిరుదునామముతోఁ బూర్వము షాజహా నను డిల్లీచక్రవర్తి యాస్థానమున విద్వాంసుఁడుగా నుండిన జగన్నాథకవి సంస్కృతమున రచియించినభామినీవిలాసమనుచతుర్విలాసగర్భిత మయిన గ్రంథముఁ దానాంధ్రీకరించినందునఁ దద్గ్రంథమందలి తృతీయముకరుణావిలాసము జగన్నాథపండితుని ధర్మపత్నియగుకామేశ్వరి మరణమును స్మరింపఁ జేయునది యగుటచేత విషయసాదృశ్యమును బట్టి కవిచే నీగ్రంథము భామినీవిలాసకరుణావిలాసమున కనుబంధము గావింపఁబడినది. ఇందు మొదటినుండి నలుబదియేడు పద్యములు కేవలము కవి విలాపమును దెలుపునవి యయినను దత్తదవస్థాభేదమును బట్టి యవి ప్రథమ ద్వితీయ తృతీయ తురీయ విలాసములని నాలుగు భాగములు చేయఁబడియున్నవి.

భార్య లంకణములు చేయుచున్న పిడుగు సమాచారము దెలుపు నొకయుత్తరము నరసాపురము సమీపమున వసిష్ఠాతీరమందొకపల్లెయయినకలగముపూడి పోలవరమునుతన యత్తవారియూరనుండి రాఁగాఁ దత్క్షణమే కవి యచ్చటికిఁబోయి; నాఁటికే దులంకణములయితన్నానవాలు పట్టుపాటి తెలివి యయినను లేక సంధిచే నేమేమో కలవరించుచున్న ప్రియురాలిని జూచి, యింక జీవింప దనునధైర్యముతో, నామె సప్రాణయయియుండఁగా శోకించుట ప్రథమభాగమును, మృతసతికి దహనసంస్కార మాదినమునసే జరిగినను సంచయనకర్మనిమిత్తము తత్పోలవరగ్రామమునఁ గవి మఱి నాలుగు దినము లాఁగవలసి వచ్చినందునఁ బ్రాణోత్క్రమణానంతర మాయూర దారను జరిగించినకర్మములను నామెవిలాసాదులను దలంచుకొని దుఃఖించుట ద్వితీయభాగమును దద్గ్రామము నుండి రాజమహేంద్రవరమువచ్చి నిజగృహమున మృతసతీప్రతిచ్ఛంద దర్శనాదులవలన మనోవైకల్యముగలిగి బహువిధముల విలపించుట తృతీయభాగమును, స్త్రీదక్షతలేమి మొదలుగాఁగల పలుకారణములవలన రాజమహేంద్రవరమున జరపవలను ప

డక, కవి తనకుమారుని (తృతీయకళత్రసంజాతుని) మాతామహస్థానమయి నలువదిరెండు మయిళ్ళదూరమున నేలూరికాలువదరినున్న సుప్రసిద్ధమగు సుంకటూరుగ్రామమునకు బోయి నిజజాయ కక్కడఁ బారలౌకికక్రియలు నిర్వర్తించుచు నార్తిఁబొందుట చతుర్థ భాగమును దెలియఁజేయుచున్నది.

తురీయకళత్రవియోగము ప్రాప్తమయినప్పుడనఁగా నైదేండ్లక్రిందటి దుర్ముఖిసంవత్సర శ్రావణమాసమున నీయన్నపూర్ణానతియక్కగారగు సుబ్బలక్ష్మియను కళత్రము కాలము చేసినప్పుడామెను స్మరించుచు నీకవిసతీస్మృతియనుపేరిలోఁ గొన్నిపద్యములువ్రాసి యందు ద్వితీయకళత్రములపద్యములుకూడఁ జేర్చి యచ్చొత్తించెను కాని దీనింబోలెవాని గరుణ విలాసానుబంధమని పేర్కొనలేదు. ఈకవి భామినీ విలాసము నప్పటికే తెనుఁగునకుఁ దెలిగించియుండెను అయినను గరుణవిలాసములోని విషయమిట్టిదని నాఁటికిఁజూచియుండలేదు. ఇటీవల నయ్యంశము దెలిసి నయినందున బూర్వకాలమునఁగూడఁ గళత్రవియోగసమయమునఁ గవులిట్లుగ్రంథరచనసేయు నాచారము గలదని సూచించుట కిదిదాని కనుబంధ మొనర్చినాఁడు. ఇయ్యనుబంధగ్రంథమునందలి పద్యములలోని భావములు గొన్నిచోట్ల గూఢములుగానున్నవి. పవిత్రమయినచరిత్రము గలిగి బహిఃప్రాణమయినభార్య పరలోకమునకేగినప్పుడు కవియగుభర్త యామెపేరు శాశ్వతము గావించుటకుఁ జేయవలసిన దింతకన్న వేఱుకార్యములేదు.

వసురాయకవి మున్నొకసారి తురీయకళత్ర వియోగ సాగరమం దీఁదులాడుతఱిఁ బరామర్శించుచు నొక మిత్రుఁడు వ్రాసి ప్రకటించుటకు నాయొద్దకుఁ బంపిన పద్యమొకటి యీక్రిందఁ బొందుపఱుచుచున్నాను

చ॥ వరకవితాలతాంగి ననవద్యమతిన్ గవగూడి రేవగల్
చిరతరసౌఖ్యకీర్తులను జెందుచుఁ దన్మొక రీతిఁజూచినీ ।
సురుచిరగాత్రలందఱది చూచి సహింపఁగలేక గాదదు ।
ర్భరతరచింతలోన నెడఁబాసిరి మిమ్ములనిట్లు మిత్రమా ॥

ఏలూరు.
దీ 10 ఫిబ్రేవరు 1903.

సత్తిరాజు సీతారామయ్య

శుభమస్తు.

# భామినీవిలాసము.

## ఇష్టదేవతాప్రశంసనాదికము.

క॥ శ్రీకళ్యాణగుణాకరు । లోకైకాధారు సకలలోకారాధ్యున్ ।
శోకహరుం గరుణామయుఁ । బ్రాకటకైవల్యకుం బరాత్పరుఁ గొలుతున్ ॥ ౧.

క॥ వినయవివేకాదుల భూ । జనులమది న్నాటుకావ్యసంతతి గలిగెం ।
పను నిస్త్రింశంబు లగుచే । తనవిద్యాయంత్రములను దలఁతు సుకవులన్ ॥ ౨.

క॥ పండితరాజు జగన్నా । థుం డమరోక్తుల రచించెఁ దొల్లిట ఢిల్లీ ।
శుం డైనషాజహానుని । సింహసభం బొలిచి భామినీవిలసనమున్ ॥ ౩.

రాజమహేంద్రాఖ్యపురీ । భ్రాజితబోధ్యసనకళాశాలఁ దెలుం ।
గోజ వసురాయఁ డాకృతి । రాజము నాంధ్రీకరించు రసికుల కెక్కన్ ॥ ౪.

### భామినీవిలాసము—ప్రాస్తావికవిలాసము. I

॥ శ్రీమత్పాద్యపటము । సీమను సారస్వతోరుసింధుమథనజన్ ।
మామకమృదుకవితాసుధ । నీమహిలోఁ గ్రోలువారి కెసఁగు సుఖంబుల్ ॥ ౧

చ॥ మదమలినార్ద్రగండగజమండలి యుండు దిగంతమందు; లోఁ ।
గదిరెడు జాలి హస్తినులఁ గన్న; మృగంబు లతుల్యకట్యముల్ ।
గద; యిపు డీజగంబున నిఁకన్ స్వకఠోరనఖాగ్రపాండితిన్ ।
విదితముగా మృగాధిపుఁడు వేనిపయిం బ్రకటీకరించెడున్ ?॥ ౨.

ఉ. మానససారసాకరముమధ్యమునన్ జలజస్థలస్థమా ।
లీనతసౌరభాంబువుల లీలగఁ గాలము వెళ్ళఁబుచ్చునీ ।
౧ మానితపుష్కరాళి యిట మండుకమండలసంకులోదకం ।
బైనసపంకపల్వలమునం దెటు నిల్వఁగ నేర్చుఁ జెప్పుమా ॥

ఉ॥ చూడఁ జకోరులేఁకరినచూపులఁ దూరుపువైపు, గల్వలు ।
న్వీడుచు నుండ మానమును, విగ్గాను చుండ మరుండు, నూడనిం ।
బాడఁగఁ జూచుచుండ నభిమానవతీజనమాన మిట్టిదొఁ, ।
గూడునె ధాత చందురునకున్ ఘటియింప ఘనావరోధమున్ ?॥

చ॥ తొరగడునీమరందమును ద్రుప్పలు దుల్లఁగ నెప్ప డానుచున్ ,।

స్ఫురదరవిందమా ! దరని సౌరభగఁ దుస్త్యాద తేపు పాడదుం ! ;।
బరమహితుం డనంగఁ బవమానుఁడె సుస్మితకోరక, తేక నీ।
బరిమళముల్ నిరంతరముఁ బర్వఁగఁ జేసెడు సర్వదిక్కులన్॥ ౫

క॥ ఏ తెంచెను దైవికముగ । నీ తుస్వాద యొంటు నవ్య తే కుటజంబా;।
బాతిగ మకరందము గల । వా తామరపూలు దీని నాదలఁ బూనన్॥ ౬

తే,గీ॥ తేఁటికూటువతో నొందు దీయమావి । మోక విలసిల్లునందాఁకఁ గోకిలంబ !।
వెడలఁ బుచ్చుము నీ వెటో, విరస మైన । వాసరము లివి, కాననాభ్యంతరమున॥ ౭

క॥ బకము లవివేకములు; దలఁ । పకు నీ కవి సలుపుపరిభవము లిల శైవా।
ళ్యకములు గావుతఁ గమలిని ! । మకరందసుధారసైక మాత్రకము లహల్॥ ౮

తే,గీ॥ అయ్యమా ! నేను గడునీచమైతి ననుచుఁ । గూపమా ! యెప్పుడునునీవు గుందఁబోకు।
సరసహృదయంబ వగుచును బరులగుణము । లెల్లకాలము నీవు గ్రహింతు గాదె?॥ ౯

క॥ విరివిగ మకరందము గల । విరిదమ్మిని వాసరములు వెడలించినబం।
భర మిప్పుడు కటకట ! యి । క్కరణిని గుటజంబునందుఁ గడపున్ దినముల్ ?॥

క॥ హరిచందనమా ! యెవ్వని । గిరలకు గోచరము తావకీనమహిమ? యీ।
గరళంబు గ్రోయుచిలువలఁ। బరిమళముల బుగులుకొలిపి భరియింపుదుగా॥ ౧

క॥ పాటీరమ ! తావకపరి । పాటిని బాటింపఁ గలదె పాటవ మెరుసం।
దోటిల్ల కొరయునరులకుఁ। బాటు మఱచి పిండి వరయ్యఁ బరిమళ మీవే?॥ ౧౨,

ఆ,వె॥ పాలు నీరు నేఱుపఱుచుటలోన రా । యంచ ! నీవె యాలసించితేని।
లోకమందు నెవ్వఁడో కులవ్రత మింకఁ । బాలనంబు సేయువాఁడు లేఁడు?॥ ౧౩.

ఆ,వె॥ పైకి గత్తివాలిపగిదిని, జెనుదాఁచుచుఁ । బాములట్లు క్రూరభంగిఁ దోఁచు,।
లోన గోస్తనీసమానులై వఱలెడు। వారుఁ గొంద ఱుందు రీ వసుధయందు॥ ౧౪.

ఉ॥ పానము సేయు చెప్పుడు భవన్మకరందరసంబు స్వేచ్ఛమై।
గానము సేయుఁగాక గమకంబుగఁ జెంగటఁ జంచరీకముల్।
నీనిరవద్యసౌరభము నిచ్చలు సర్వదిగంతరంబులన్।
మానితభంగి నింపఁ బవమానుఁడె సుమ్ము ప్రవీణుఁ డబ్జమా!॥ ౧౫.

ఉ॥ వేసఁగి వేఁడిమి వ్రేల్మిబలువెట్టను నే వఱుపట్లుగొన్న, సా।
యాసపిపాసు లధ్వగుల కాదరు వెంతవ రంచు నెప్డు, లో।
గాసిలు చుంటఁ జేసి, తనుకార్శ్యము నొందెడుదారి చెర్వ్వడే।
వాసికి నెక్కుఁజీవనము; వార్ధులపుట్టువ దేల గాల్పనా?॥ ౧౬.

॥ కాలకాల మంచు నెల్లఫులుఁగుల్ దివి నేగును, దీయమావి నో।
గ్గలగమి బొమ్మబొమ్మనుచు గండుటళుల్ వెస మూఁగు, నీవు శో।
భిలఁగఁ ఁ గోలంక! యిం కవరిఁ జేరు ని దింతన తీఱుఁగా కయో।
కలుతు మునుం గదా మనసు, గాంచిన నీయతిదీనమానముల్॥ ౧౭.

క॥ తుమ్మెదవలె సౌరభలో। భమ్మున నిముఁ జేరె ననుచు భావింపకు మో।
తిమ్మెరను! లోకహితముగఁ। దమ్మీ! యితఁ డర్థియగు నుదారుం డయ్యెన్॥ ౧౮.
మానముఁ బూనకు మాలతి! । మానుగ గుంజితము సలుపుమధుకరము నెడన్; ।
దానకళాగురువులు సం । తానతరువు లెల్ల దీనిఁ దమతలఁ దాల్చున్॥ ౧౯.

ఆ॥వె॥ సకలగుణము లున్న, సాధుసేవ్యత లేక । పోయె. నేద్విజిహ్వములకలమున,
వానిని స్వహింతు, పాటీర! తావకా । న్నత్య మహహ! యేమనంగ వచ్చు?॥ ౨౦.

క॥ గహనము సకలము వెదకెను; । బహువిధముల భ్రమఁరు లన్ని పరికించె; నాహో।
సహకార! యెక్కడను మధు । లిహము భవత్సమము గాంచ లే దీజగతిన్॥ ౨౧.
కలపూలతావి, దనకడఁ । దలపెట్టఁగ రాని దేవతరుకుసుమముపై।
నిలిపి పద మొందు విరి పొం । తల పోఁ దలపోయ వేని, ధన్యము వె యళీ॥ ౨౨.

క॥ పావనివి వింధ్యసంభవ । నోవాహిని! యిపుడుచున్న నుచితమె యిది? లో।
భావించి చూడు మెన్నగ! నీవీథులకలుషజలము లీవు గ్రహింతే?॥ ౨౩.

క॥ పండులుఁ బత్రంబులుఁ, బూ । లుండున దెన్నండు లే దయో! బర్బురమా!।
ముండుల నెప్పుడు నిండుక । యుండెదు; నిన్నెమి గోరి యుపసర్పింతుర్?॥ ౨౪

క॥ ఈకానను, గోకిలమా! । యేకాకివి; కంఠ మెత్తి కూఁయ మనుమా;।
కాకు లివి నిర్దయంబులు । నీ కాగ్గానరింప కుండు నిజకుల మనుచున్॥ ౨౫.

క॥ స్ఫురితతరువిసరసుషమా । పరిహారక మఖిలజంతుబాధాకర మో।
యురుతరుహీనము, నేగోనమున । భరియించెద వెపుడు విడక పార్వతిజనకా॥ ౨౬.

క॥ నీయొద్దకు నేతెంచిన । యీయళికి నవజ్ఞ సేయ కేనుఁగుగున్నా!।
నేయమ్మున దాన స్తవ । నీయమ్ములు కరులు, దీని నెత్తిని బూనున్॥ ౨౭.

క॥ దేవతరుకుసుమసౌరభ । సేవం గోరికలు దీతె చెలఁగెడునలికిన్।
బూ వన్య మైనదానిని । సేవించుట కేవలంబుఁ జిట్టకము గదా!॥ ౨౮.

క॥ గాలించె నెల్లభ్రమరకుల । నాలించెను గోకిలముల నడిగి రసాలా!।
పాలింప నీకుఁ జాలిన । దీలోకములోనఁ గాన విందిందిరముల్॥ ౨౯.

చ॥ తెనరున నోయిమాలకరి! నీ వుడు కెలడేల మందు వేసఁగిం!
గనుఁగొని కొంచెపాటి యుదకంబు గొసంగి యునర్చ్చుపుష్టియా।

వసించిన యొక్క కొల్ల భువనంబున జల్లుల ముంచు మేఘ్ఘ వా।
ఘన మయినట్టి యథార్థముగఁ గల్గఁగఁజేయ నశక్యమాఁ జూమీ॥ ౩౦.

ఉ॥ వెంగలి తోఁటవాఁడు ? పృథివిం గలకేమ హరించిపోయె ; వా।
త్యం గడుకావిరుల్ గవిసె నాళల ; నెండలు మెండు లయ్యె ; సం।
పంగియు కీమరుస్థలి నపాయకరంబౌ దె యన్ని ; యిట్టు ల।
య్యం గమలాసనుం డెచట నుండిరొ నిన్ననిశం బహూమముచా!॥ ౩౧.

ఉ॥ ఏకద వాసవార్చ్యుమ దనేకమిళిందము లేనికల్ భయా।
కోలలోచనల దేహాబలం బణు, మాత్తకప్రజల।
చేకడఁ జొర్ల చుండెడు, మృగేంద్రుఁడు దాఁ బరలోకమేగ, న।
వ్వాకిట నిత్తతిన్ శివ శివా! చెవి సోఁకు శివావిరావముల్॥ ౩౨

ఉ॥ మాకరి మ్రాఁకు లన్నిటి సమానపుఁ బ్రేమను పెంచెఁగాని, ప్ర।
త్యేకమొఁ జూపఁ డీపొగడ కమ్మవయక్కటికంబు నైన ని।
ష్టాక క్రమప్రవృద్ధ మయి పూఁచి, నితాంతలతాంత సౌరభో।
ద్రేకముచే దెస ల్మానరించె మధుపారవపూరితంబుగన్॥ ౩౩

ఉ॥ వలను మెదల్పకుండుం; దిటము పాఁకు, పటిష్ఠము తెల్లకొమ్మలున్ ;
నెల వోరు లెక్కరానిముల ; నీ కిఁక నేలెగ జోనగాధిపా!।
పిలుకుచుఁ బుట్టు నైన నెఱవేఁకి యొకం డెదసెంచ ; నర్ఘ్యజాలం
బొలసెడు ఘుగ్నకీలల మహోగ్రదవానలఘు స్తరుం డయో॥ ౩౪.

ఉ॥ వేసఁగి వేళ జేవలుఁగు వేఁడి వెలుంగుల వేఁగి, దీర్ఘ స।
ల్యాసరమౌ ల్నినున్ మదిఁ దలంచుచు నెక్కటి నెట్ట, నెట్టకేఁ।
జేసిన లోంటిపున్నెమునఁ జేసి కనంబడి నేఁడు? నీరదా!।
గాసిలు చాతకంబుఁ గరకంబుల మొత్తను జిత్తగింతువే?॥ ౩౫.

చ॥ దరితోని కారుచిచ్చు మిను దాఁకెడుమంటల నేర్పుటం, గటా।
తెరసినతీవియా ల్పదలి బిట్టుగ మాఁడుచుఁ జెట్లు లుండ, నీ।
సిరిగరువం బి దేటిది? వచింపుము నీలపయోద! సర్వదా।
గురిసెదు కొండకొమ్ములను కుఱమల ముంచిన లాగు సోనలన్॥ ౩౬.

క॥ ఓరి తెరువరి! వెఱవకు! దాని నిలని పరుసగర్జితము నెపి సోఁకన్ ;
ఘోరభువనార్తిహరణ! కాలజలదాళి యులేఁడు ఘనుఁడ దని వినవో?॥ ౩౭.

క॥ బంగారిసీరుచాయను । రంగారెడురమణితోడిరాముం గని, సా।
రంగంబులు గాన నటెం। పం గడఁగు వెఱుఁగుతోడివు బ్బనుబుద్ధిన్;॥ ౧౧౬

క॥ జను లంద తీమెఁ గనుఁగొని । యనుదురు వనిత యని; వారి న ట్లనుకొ ని।
మ్మనుకొనియెద నే, నిది యువ। జనపరిణతచిరతపస్య, సత్య మటంచున్;॥ ౧౧౭

ఆ॥ వె॥ నగుమొగంబు గలుగుసొగసరి నామె, న । చ్చటఁ జకోరవారచంచరీక।
సంచయములు గాంచి, సమధికసంతోష । తోయరాశియందుఁ దొప్పఁదోఁగ;॥

క॥ స్మితసుషమాలేశము నం । చితవదనాబ్జమునఁ దాలిచెవ వెపు డపుడే।
సతి! యీజగ మఖిలంబు వి । జిత మయ్యెడుఁ బంచబాణుచే, ననుకొందున్;॥ ౧౧౯

తే॥ గీ॥ అమలయమునాజలంబుల నర మునింగి, । గొంతుకల నెత్తి కూసెడుకొంగ లొప్పెఁ
జిమ్మచీఁకటి పగఁ బట్టి తమ్ము ౖమ్రింగఁ,। జెల్లు వాపోవుజాబిల్లిపిల్ల లనఁగ;॥ ౧౨౦

క॥ అన్యోన్యసంగసుఖమునఁ । కన్యామణిపస్నదోయి గన నస్నటిఁ, ప।
ద్ధన్యత్వంబున కోర్వమి, । హైన్యంబును బొంది మధ్య మని భావింతున్;॥ ౧౨౧

క॥ సకలజనమోహకము,నీ । చికురంబులపేరిచిమ్మచీఁకటి, ముఖచం ।
ద్రకరాప్రచారమునవో, । సకియా! జిగి మిగిలి నెగడు సత మని తలఁతున్;॥ ౧౨౨

తే॥ గీ॥ పగలు రేయును గుత్తుకబంటినీట । నర్క నారాధనము సేయు నబ్జపంక్తి;।
పక్ష్మలేక్షణవక్షోజభావమునకు । ఘోరతప మాచరించు నొక్కో తలంప?॥ ౧౨౩

॥ వె॥ ఘోరవిరహవహ్నికుండంబు నాఁ దగు । నీదుహృదయమునను నీరజాక్షి!
తపము సేయుచున్న దిపుడు ముక్తాహార । మెనయఁ ౖబియసమాగమైకసుఖము;॥

శా॥ లావణ్యంబున కాకరంబుగ, ననల్పప్రౌఢి నీమోముఁ దాఁ।
గావించెం జతురాస్యుఁ డైన, నుచితజ్ఞత్వంబు గానంగ రా।
దావం తాతనియం దదేమనిన, సారంగాక్షి! నీ వుండఁ గా।
రేవెల్గున్ మఱి రాజుఁ జేసెను గదా, రిక్తున్ గళాహీనునిన్;॥ ౧౨౫

ఆ॥ వె॥ సకియ! నీదుగుబ్బచనుదోయినడుమఁ జక్కఁ, । గాన వచ్చుమానికంబు వొలిచె,।
సానురాగ మైనమానస మాత్మేశుఁ । గాంచ, వెలికి నిర్గమించె ననఁగ;॥ ౧౨౬

క॥ జగదంతర మమృతమయం । బగుకిరణోత్కరముచేత నహహా! నిండెన్;
మృగనయనమొగము నెవమున । దొగరాయఁడు, జిగి దొలంకఁ దోతెంచె నొకో?॥

చ॥ అమవసచిమ్మచీఁకటియు, నచ్చపుఁబున్నమచందమామయున్,
గమలములున్, శరద్విశదకౌముది, కాంచనకోరకంబు, వి।
ౖద్రుమమును, నెప్పు డేని యొకతూరి జగంబునఁ బొందినన్ సమా।
గమ మపు డించుకంత గజగామినిమోమున కెంతు సామ్యమున్;॥ ౧౨౭

క॥ ఓదయిత! మాను నీమవి । పాదం బని, ప్రియుఁడు పలుక సాదరఫణితిన్,।
  జైదలికిఁ గనులబాష్పము, । నూఁదినమడిలోనిమాన మొక్కట జాఱెన్;॥ ౧౨౯
తే॥గీ॥శంబరాసురగర్వభంజనునిసుప్త । సిద్ధసామ్రాజ్యపట్టాభిషేకమహము ।
  వేళ, లోకంబులకు నెల్ల వెల్ల నలుచు । జోక, నొప్పారె రాక, సుధాకరుండు;॥
క॥లోలాలకావృతం బగు।బాలామణియాననంబుఁ బరికించి, భ్రమ।
  ల్లోలంబసంకులం బగు।నాళీకము సంస్మరింతు నాహృదయమునన్;॥ ౧౩౧
క॥ గురుజనములతో నరుగుచు,। దరహాసము మోముఁదమ్మిఁ దళుకొత్తను, సుం।
  దరి దిరిగి చూడఁగా, నది । పరుఁ జంటం డుస్సి చనెఁ బ్రపంచంబునకున్;॥ ౧౩౨
తే॥గీ॥బహుళశిఖుంజరిటభంగభాగ్యంబును । గలికికన్నుదోయి గాంచఁ గాక,।
  నిత్యశోభ మైననెమ్మోము, భంగుర । సంపదబ్జమునకు సాటి యగునె?॥ ౧౩౩
క॥ తెమ్మెర, గంధము, దూఁడుల్ । దమ్ము లుశీరమ్ము, శైవలము, నపగతశై।
  త్యమ్ములుగఁ దోఁచు, విరహభ।రమ్మునఁ జైతన్య మెడయుప్రాణుల కహహా!॥ ౧౩౪
క॥ తనకరముల నిమురుచుఁ, బ। ద్మిని ముద్రితవదన నల్ల మేల్కొలిపి, కరం।
  బనురాగపూర్ణుఁ డగుచుం । దనరారెడు భాస్కరుం డుదయకాలమునన్;॥ ౧౩౫
ఆ॥వె॥మ్రొక్కి వినయవచనముల బతిమాలుచు । వర్ణించినను, మహాగ్రహమున।
  వెడలిపోవునన్ను, వ్రేలిసన్న మెలంగు । పిల్లికూనచేత, వెలఁది యాఁగె;॥ ౧౩౬
చ॥ అమృతముఁ జిల్కుచుండు భవదానన మోననఁబోణి!యంతటన్,।
  సుమశరచాపపున్నిమ సుంతయునం గన డంతరాయమున్;
  తిమిరముతో మహీప్రజకు దృష్టులతాపము గూడ రూపఱెన్;
  రమణిరో! శ్వేతుఁ డీశశి, నిరంతర మిట్లుదయంప నేటికిన్?॥ ౧౩౭
ఉ॥చాల వివేకమున్ సుగుణజాలముఁ దాలుచువార లయ్యుఁ గో ।
  పాలులు, వారిహృత్పుటము, వాస్తరవారిని గేలఁ బూనఁ జే।
  చీలిక లింత లింతలుగఁ జీలుపఁ జాలువినీలవారిజా।
  క్షీలసమానజాలమయచిత్రవిలాసము భాసమాన మౌ;॥ ౧౩౮
ఆ॥వె॥నివ్వటిల్లె నెపుడు నెలఁతకు నిండుజ । వ్వనము నవవిలాసభవన మగుచు,।
  నప్పు డాది గాఁగ, నిప్పు లేకయె, కోడె । కాండ్రమానసములు మండఁ దొడఁగె;॥
ఉ॥నూడదు కన్నులం దెఱచి సుంతయు;నవ్వుమొగంబుతోడ మా।
  టాడదు; తాపకీనకథలం వది భ్రూకుటిఁ బూను; నంచు నీ।
  జాడ, సపత్నిచేష్టలు నిజప్రియుతో నెఱిఁగించునంతనే।
  యీడెను భర్తకుం దనపయిన్ మును పుండిననిండుప్రేముడుల్;॥ ౧౪౦

క॥ హాలహలౌర్వానలములు। పోలిక మకరద్విజిహ్వములతోఁ జెలఁగన్
నాళీకవైరి ; లోకుల । కేలా ప్రాణాంతహేతు వికఁ గాకుండున్ ?॥ ౧౪౧

క॥ సుకృతంబున సుకళత్రము, । సుకళత్రముచేత దొడ్డసుతులు, సుతులచే ।
నకలంకస్థిరయశ మ । య్యకలంకస్థిరయశమున నాకము, నొదవున్ ;॥ ౧౪౨

క॥ ప్రభు వైనను యాచించిన, । లభియించును లాఘవంబు ; లలనామణి ! నే
నభిరుచిపడి యధరమునకు, । నభిభూతుండఁ గానె విముఖి వగునీచేతన్ ?॥ ౧౪౩

ఆ॥వె॥ కొలఁకునందు ముంచి జలపూర్ణకుంభంబు । నెత్తికొనుచు వేగ మింటి కేగు
నీకుతటనిపుంజనిర్వ్యాజరూపంబు । భోగ మొకమహోధవునకె యొఱుక ;॥ ౧౪౪

ఆ॥వె॥ పాంథ ! నీవలె నాప్రాణవల్లభుండు, ముంగ్లఁ గంగ్లను, గడగంగ్లు పాంసు చుండు;
నింతకన్నను గుశల మిం కేమి చెప్ప ? నిప్పటికి జీవములతోడ నిట్టు లుంటి ;॥ ౧౪౫

క॥ తరుణీ ! చిక్కాలి వేటికిఁ ? । బరకీయోపాంతమునను బని నీ కేమీ ? ।
పరితోషించెదఁ జెపుమా ; । తెరువరి ! నీలెఱుఁగ నీకుఁ దెలుపును బొమ్మా ;॥ ౧౪౬

క॥ ఆలోకింపక నీకుం । బోలిక, నత్యంతగర్వమును బొందకువే ;
బాలిక ! బహుఫల భరమున, । ప్రాలినలత లెన్ని లేవు వనములలోనన్ ?॥ ౧౪౭

ఆ॥వె॥ ఉల్లసిల్లుచున్న దువిద ! నీవెన్నాము ; । కన్నుఁదమ్ములును వికాస మొందె
జలదమయము గాను జగ మెల్లఁ గావించు । నీలమేఘ మెచట నేనిఁ గంటె ?॥ ౧౪౮

క॥ ఆపాయముఁ దోయముల ను । పాసించుచు సవిత్రుఁ, జిరతపశ్చరణమునన్,
గాసంతె యిపుడు సారస । మోసఖి నీముఖముతోడ నుపమం బొరసెన్॥ ౧౪౯

క॥ మందస్మితమధురంబుగ, । సుందరి ! నీమొగ మొకింత చూపించితివా,
డిందుపడు నిపుడె పున్నమచందురు సామ్రాజ్య మెల్ల క్షణమాత్రమునన్ ;॥ ౧౫౦

ఆ॥వె॥ తెలుచు నవ్వుకొనుచుఁ, దనలోన నేమేమొ । యుల్లసిల్ల మాట లాడుకొనుచుఁ
గోకనదముఁ జేసికొనుచు లోకత్రయిఁ । జూచు మద్యపాయి శూన్యదృష్టి !॥ ౧౫౧

ఆ॥వె॥ మధురసంబుకంటె మగువ ! నీయధరంబు । మధురతరము ; చొనుపు మన్ముఖమున;
పపప,పడును నయయో! పుపుపు,పుడమిఁ;బట్టు । శాకరాంబుజంబు నీకరమున;॥ ౧౫౨

ఉ॥ అంగద నెట్టకేలకు నుపాయశతంబునఁ బ్రాఁకి సౌధమున్,
బొంగెడుపాలవెల్లినుఱువు న్నగుబ్రోన్నపసెజ్జ, నొంటి సు
ప్తింగనుదాని మేల్కొలిపి, భీతమృగేక్షణ సస్మితాస్య రా
జాంగనఁ గౌఁగిలించు, నహహా ! సుకృతాత్ముఁడు నిశ్వసించు నన్ ;॥ ౧౫౩

క॥ గానము సేయును మధుకరము । గా, నంతటఁ దిరిగి యభిముఖముగాఁ బఱచున్,
దో నెగయును, మరలు, దిరలును, । మానినితానాసారములను మధుకరచయముల్॥౧౫౪

ఆ॥వె॥ నిరతరాగాతిశయమున, నేను దన్ను । సారె సేవించుకొలఁది, నాశ్చర్యముగను,
లలన మెలమెల్ల నన్నింటివలనఁ దిగిచి, । తత్వకథవోలెన స్నేకతానఁ జేసె;॥౧౫౫

తే,గీ॥ లోలమృగశాబనయన యిల్లాలు గానఁ । బడక యుండిన లోనఁ, జెప్పెడిది యేమి?
యఖిలసంపదలను బూర్ణ మగుచు నున్న, । భవన మది గాదు, నిర్జనవనమె గాని;॥౧౫౬

ఉ॥ గాలికి నిట్టటుం గదలు కాటుకనిగ్గులు దేరుముంగురుల్,
లోలవిలోచనంబులును, లోవలచూపుల నెల్ల నాచిరో,
హాళిని నీము సేరుజవరాలివిలాసగతిం గనుంగొనం
దూలక నంటుకానిమది నూల్కొని తాలిమి నిల్పఁ జాలు నే?॥ ౧౫౭

చ॥ ప్రవిమలవంతకాంతిరుచిరంబు, సుధామసృణంబు, సంచజో
త్సవహరముం బ్రవదాననముఁ, జక్క సృజించినవాఁడు వారిజో
ద్భవుఁడు విపశ్చిదగ్ర్యుఁడు గదా మృగశాబక నేత్ర ! యాతఁడో
యువిద ! దొలంపఁ జేమి కతమో పునరుక్తముఁ జంద్రబింబమున్?॥ ౧౫౮

ఆ॥వె॥ సానుకంపములు మహానురాగంబులు । శిలకితలములు చెలియనటుర
చిత్తవృత్తి లేమి చెప్పను ? నయ్యారె! । యస్మదీయహృదయ మపహరించె;॥౧౫౯

ఆ॥వె॥ అహికిశోరశీల మలకజాలము, నెఱ । వాఁడితూపురూపు వాలుఁజూపు,
తాను జంచలోపమాన, లోకంబునఁ । జాన యెట్లు సౌఖ్యసాధనంబు?॥ ౧౬౦

తే॥గీ॥వచనమున నంశమాధురి, మృదుల మైన । హృదయమున నంత కారుణ్య మెసఁగుహరిణ
శాబలోచన! యిరి యేమి చంప మిపుడు। గుణగతులు నీవి వేఱుగా గోచరించు?॥౧౬౧

తే॥గీ॥ అనిశనయనాభి రామశోభాతిశయము । కలిమి గర్వించునీదుముఖంబుతోడ, । నా
నిశను శోభావిహీన మానీరజంబు, । నెటులు తుల సేయఁ దగు, నింతి! యంచు కైన॥౧౬౨

క॥ సుకుమారతరము లగునం । గకములఁ, గుసుమములశోభ గాంత జయించున్; ॥
వెకలించెను నాప్రాణము । లకటకటా ! కుసుమబాణుఁ డింటకతతులన్;॥ ౧౬౩

క॥ దురపిల్లు నలుఁదపిలుఁగుల । బరువునఁ, దెరువూను మృదులపద నడుచుచు ; న
త్తరుణీమణిఁ గని యకటా ! । దురపిల్లుదు నేను నేమి తోఁపనిబుద్ధిన్;॥ ౧౬౪

ఆ॥వె॥ మసునిష్ఠానమందు మధురాపురప్రయా । ణాభిముఖుఁడు గా, వ్రజాంగనలకుఁ
బ్రళయసహ్న యయ్యెఁ జెందువెన్నెలరేయి; । వారి కంశి యయ్యె వాసగృహము;॥౧౬౫

చ॥ శయనగృహంబు సొచ్చి, చెయిసన్నల నెచ్చెలి నల్లఁ బుచ్చి, నేఁ
గయికొని పీవనన్ విసరఁగా, గుపితాంగన, కూటనిద్రఁ గం
తయుఁ గను మూసియున్, గనని దానివలెన్ గనుమోడ్పుతోఁ, గడుం
బ్రియసఖి! దస్సితంచు నెనమోఁదఁ గదించె మదీయహస్తమున్॥ ౧౬౬

క॥ గమనము బాల్యములో మాం । ద్యము నొందెన్, దక్క మన్యె స్వాంతములో నౌ
ష్ఠ్యము, హరిణీదృశకు, నితం । బము సర్వోన్నతిఁ దనర్చె మన్మథులోడన్;॥ ౧౬౭

తే॥గీ॥ ఊరు పనుమాన వేద్య మూ;నొడలు కలువ । కాడ గ్గునది; మాపేమి యాడదున్న
దామెన్ఫృత్తాంతమింక నీవట్టి లుంచి, । చెప్ప మన్యచరిత్రంబు; చెలిమికాఁడ!॥ ౧౬౮

ఆ॥వె॥ పరిణయమున రామభద్రుండు పట్టకో, । స్వేదకంపములను సీతకరము
సాంద్రహిమసమేతఝంఝావిధూతప్ర । భాతవారిజాతభాతిఁ దనరె;॥ ౧౬౯

తే॥గీ॥ అరుణ మైనను బగడంబు నతకకంచు, । మృగుల మైనను జివురాకు గదిమి యైచు
నిరతిశయమాధురమానిలయ ముగుటఁ, । దానకీనాధురోష్ఠమె మోతలీరుఁబోణి!॥ ౧౭౦

తే॥గీ॥ అణిముత్యాలత్రోవలఁ గ్రేణి సేయు । కాంతిసురతాంతఘర్మాంబుకణిక లామె
దంపనప్రంగాయనొసట్టిపై గూడి చెప్ప । రానియద్వోన్యశోభాకరతఁ దనర్చె;॥ ౧౭౧

క॥ పగప్రమద్దృష్టిహాలిభి । దురహాలికన్ వెలుచి సీత దూరెఁ బ్రియుహృదిన్;
జోరఁబడె నటఁడును బరనా । ర్యరగీభయమునను నామెయుల్లము సరగన్;॥ ౧౭౨

తే॥గీ॥ అంగకిము లిచ్చి మనుజులప్రాణములను । గొనిన, నది యుక్త మగుఁ గాని;
సరసిజాక్షి! నయనపద్మద్వయంబు కోణమునొసంగి ప్రాణములఁ గొంట, నీకిది పాడిగాదు;

తే॥గీ॥ ముక్తియంబులసిరులకు ముద్రమ్మ లయిన । పంతముల చెంత వసియించి సంతసించు
నందు, సతిసాహసంబునఁ జంచలాక్షి! । ముక్కుతల దొక్కి నిలిచె నీముక్తియంబు॥

ఆ॥వె॥ నాసికాగ్రమునను నవమౌక్తికము గల్గె । భాసమాన మయ్యెఁ బడఁతిమోము,
బుధసమాగమమునఁ బోలు చుప్పున్నమనాఁటి । లలితచంద్రమండలంబు వోలె;॥

క॥ నీమేనిపసిమి చూమక । వేమారెమిటికి విజ్జుపీఁగుదు? ముగుదా!
నీమెయిచాయం బోలిన । హేమంబు దొరలు మంపవే యింటింటన్?॥ ౧౭౬

క॥ భువిని నిరంకుశు లనఁబడు । కవులు, కుచంబులకుఁ బోల్పఁ గరికుంభములన్ ।
దవిలి చెలి! యేల వినియెద । వవిపలు విపరీతకథల నూఁకొందురు కా॥ ౧౭౭

ఉ॥ కోమలి నక్కఁజేర్చి యది కోపముచేతఁ దిరస్కరింపఁ ద ।
న్నామొగ మైపడందెఁ బతి; యప్పుడయి నాథు మనంబు నొచ్చునో
యేమొగ దంచుఁ దల్లడిలి, యేణవిలోచన వాని చెక్కులన్
జేమను దుడ్డుఁ బెట్టుకొని, పెద్దయుఁ బొద్దు ఘటించెఁ గౌఁగిటన్॥ ౧౭౮

క॥ కనుఁగొని హరిఁ, జేలచెఱఁగు । గొన వదనసుధాంశు మాటుగొను వ్రేతలకున్,
జనితస్మరకంపవశం । బునఁ దత్సమయమునఁ బోకముడి బిగి సడలెన్;॥ ౧౩౯

తే॥గీ॥ మోవితోడిసమాగమమునను జేసి । రదనభావళ్య మరుణిమాక్రాంత మయ్యె;
నైన సిత మైన లోలాక్షిహాసితమునను । మరల నది జాతపక్షమై మాఱు మలసె॥ ౧౪౦

ఆ॥వె॥ దొండపండుమోవి, తోయజంబులతావి, । గలుగునీదునెమ్మొగంబునందు,
మణిసమానరదన! యణుమాత్రమైనఁ దాం । బూల మెట్టు లెఱుఁగఁ బోలుఁ జెపుమ॥

క॥ చేయన శయనించియుఁ దన । కోరిక లన్నియును దీర్చుకొనఁ జాలక, బా
లారక్తమ్ము దయితానన । హారా! దరమీలితాక్షి యయి వీక్షించున్;॥ ౧౪౧

ఇది యాజువేలవంశాభ్యుదితుఁడు
వ.సు. రాయఁ డాంధ్రమొ
నరించినయట్టిది, భామినీవి
లాస నిగదితము, శృం
గారనామకవిలా
సము.

## కరుణావిలాసము.

---

క॥ దైవము కట్టా! విముఖము । గావుట, బంధుమణీ యీజగంబును విడిచెన్;
నీవెత లెవరికిఁ దెలిపెద । వేవారు ప్రియోక్తిఁ దేర్తు రిఁక నిను? మనసా!॥

చ॥ మునుపటిలాగునన్ వినయపూర్వముగా నెదు రేగుదెంచి, క్ర
న్నన ననవిల్తువిందు లగు నవ్వుమెఱుంగుటనుంగుఁబల్కులన్,
జనికెడుజాంటిలేనియరుచిం బచరించెడుమంజులోక్తులన్,
బ్రణయిని! నేఁడు నామది లవంబును జల్లన సేయ వేమయో!॥ ౧

ఉ॥ చట్టన నింద్రియార్థములు సర్వము విస్మరణంపుమార్గముం
బట్టెను; విద్యయున్ విముఖభావముఁ బొందెను గుండుపేరిమిన్;
మిట్టెడుగండుమీలపస మెచ్చనికన్గవ గల్గుకల్కి, యే
పట్టున నాదుడెంద మెడఁబాయదు తా నధిదేవతాకృతిన్;॥ ౨

తే.గీ॥ నీవు నిర్వాణమంగళనిలయమునకుఁ । ద్వరితగతిఁ బోవుచును దయావరిరోదయయు
వీడితే? ప్రభాతనీలారవిందసుంద । రాయతకటాక్షములఁ జూడ వయయొ! నన్ను॥

ఉ॥ అడుగుఁజిగుర్పు దొట్రుపడు నన్నభయంబునఁ జేసి పెండ్లిలోఁ
బడఁతి! మదీయహస్తమును బట్టుక యెక్కితి గావె సన్నక
ల్లెడఁద సహస్రమార్గముల నేగుచు నున్నది, సన్నుతాంగి! యీ
య్యెడ విడనాడి నన్ను నెటు లెక్కితివో త్రిదివంబు? నక్కటా!॥ ౪

చ॥ గొనములు గల్గి, దోసములఁ గూడ కలంకృతులం దనర్చి, మె
త్తనినిజవర్ణరాశి శ్రుతిఁ దన్పుచు, భావరసప్రపూర్ణ యై,
యనయము మామకీనకవితాకృతిఁ బొల్చుమనోభిరామ రా
మ, నిముసమేని నా దయితమానసముం నెడఁ బాయ కుండెడున్॥ ౫

చ॥ జలరుహసంచయంబునకు స్వాంతమునం గలచింత యంత యున్
బొలిసెను, చంద్రమండలముఁ బొందెను నిస్తులభూరిశోభ, బ
ల్కులకల మెచ్చెఁ గోకిలకులంబుల కక్కట! యొప్ప డీ విటం
దలఁగి దినంబు చేరితివి, నాఁటను గోలెను; ప్రాణవల్లభా॥ ౬

చ॥ మిలమిలలాడి మాయ మగుమించులసంచు హసించు భ్రాంతులం
గాలిపెడు నింద్రభోగములు, గొన్నదినాల్ చవిఁ జూపి, మంత్రపుం
బలము దొలంగినట్టి వరపాలునియుజ్జ్వలరాజ్యలక్ష్మియున్
బలెఁ, గలికీ! యకాలమున నాచెయి జాఱితె భాగ్యవిద్యుతిన్ ?॥ ౮

ఉ॥ ఏ నొనరించినట్టి నెర సేయదియో మఱిఁ దోఁప సంభవం
బైనయఖండకోపమున కయ్యొ! వశంవద వైతివే ? సఖీ!
ప్రాణమువంటివన్ను విడనాడి, పతివ్రత వయ్యు, ముక్తికాం
తానిలయంబు సేరితివి, దవ్వన కివ్వడి; నేమి సేయుదున్ ?॥ ౯

చ॥ అమృతపుఁదేటలుం గలె మహారసవంతము లైననీవిలా
సములె, మదాత్మలో మునుపు చారుగతిం బరిణామ మొందె, కా
వ్యము లగుచుండు; నిప్పు డవి యయ్యోఁ గదా గగనారవిందముల్?
రమణిరో! మాకు నెట్లు సుకరంబు లికన్ సుకవిత్వసంపదల్ ?॥ ౧౦

చ॥ ప్రవిమలతావకీనమసృణస్మితరోచులచేత, భాసిలన్
గువలయ మెల్ల, సత్కవులకున్ స్పృహ యం దెడి గోఁ గఁ గ్రీ ని
త్క్రవముగ నల్లపూర్తిగను, చకోరవిలోచన! నీవు లేక, ని
య్యానసరమం దమందవిజయంబునఁ బొందుచుఁ బొందె నింగికన్;॥ ౧౧

శా॥ నాకున్ సుందరమందహాసుధచే స్నానంబు గల్పించి, దృ
గ్వ్యాకోచప్రతిభాతిత్వలంబులను నిత్యం గర్చులన్ సల్పుఁ, గా
నేక శ్రీణమయస్వరూప, ప్రియమురం ఱిర్వాలు పోచెల్ల!, యా
నాకామేశ్వరి సుంత పాయుగు గదా, నామానసం బిప్పుడున్;॥ ౧౨

ఉ॥ నవ్వుచు, నెవ్వరిన్ రమణ! నాథ! మనోహర! యంచుఁ బిల్చి, నీ
విన్వసుధం జరించుచును నెక్కుడుగాఁ జేసితివో దివంబు, నో
జవ్వని! యట్టివాని నను, స్వర్భువనంబున కేగి యయ్యయో!
యిప్పుడి ధూళి ద్రుంగ మహి నెవ్విధిఁ గూలఁగఁ ద్రోయఁ జాలితో?॥ ౧౩

శా॥ లావణ్యంబు సముజ్జ్వలంబును, నతుల్యంబున్ సుశీలంబు, న
ర్ఘావాసంబు నయం బనన్యజనలభ్యంబున్ విధేయత్వమున్,
నీవాని న్నను, నిశ్శరణ్యులను గాసి వింద మీన్ వీడి, నా
దేవీ! యీవిధి నొంటె మింటి కరుగన్ డెం దెట్లు గావించితో?॥ ౧౪

చ॥ కనకముకన్న మిన్న యగుకాంతిఁ, బ్రసిద్ధవిశుద్ధి, నెప్పుడున్
దనశిఖలన్ బరాభవ మొనర్చుచు నుండు పటంబు, నెంతయున్
గనలు మనంబునం గరిరి కాలె మనోహరురాల వైచని
న్ననలుఁడు నిగ్రహించెనకటా! దయ మాలి? మృణాలకోమలా!॥ ౧౫

ఉ॥ చల్లనఁ జేయుఁ గన్నులను జయ్యనఁ గప్రిష్ప వ్రమాడ్కి, సం
ఫుల్లసరోజమాలికయుఁ బోలెను గంతసు శైకహేతు వౌ,
నుల్లము దన్పు సత్కవితయుం బలెనే, జగదేకరమ్య వా
యుల్లసపాణి; తాను సురభామినిరీతి నరిగెనయ్యయో;॥ ౧౬

సీ॥ పెనిమిటికంటె నన్యు మరి వేనిని స్వప్నములోన నైనఁ గ
న్గొనవు గదా యొకప్పుడును, గోరికఁ గూరినమానసంబునన్?
వనజపలాయతాక్షి! తెలుపం గదవే, యటు లుండునీవు, నేఁ
డెనయఁగఁ బోయి తెల్లి, గుణహీనుఁడునుం బరుఁ డైనపూరుషున్?॥ ౧౭

ఆ॥వె॥ వ్రాఁపయునుంగు జీవితేశ్వరుగుణములు। సంస్మరించుకొనుచు, శయనమందు
క్షణమునరును ముందు గానరాదృకృశాంగి,। పలుకరింప నిప్పుడు పలుక దకట!॥ ౧౮

చ॥ చెవి నమృతంపుఁదుంపరులు చిల్కుఁడుకల్కియనుంగుఁబల్కులున్,
కవికభివందనీయ మయి, క్రాలెడుబాలమనోజ్ఞ రూపమున్,
నెవము లవమ్ము లేనిదయ నిండిన పౌసతిభిన్నకృత్యముల్,
స్తన మొనరింపఁ జిత్తము ప్రసన్నతఁ బూనక పోవు నేనికిన్?॥ ౧౯

ఇది గూలుపేల సంశాభ్యగిరుఁడు
వ.సు.రాయఁడాంధ్రమొన
రించినయట్టిది, భామినీ
విలాసనిగదితము,
కరుణాభిధాన
విలాస
ముగిసెన్॥

## సతీస్మృతి

## కరుణావిలాసానుబంధము.

### ప్రథమ విలాపము.

శా॥ శ్రీకైవల్యరమాధిరాజ్యపదవీసింహాసనాస్థానకా
ళీకాంతుం డపమృత్యుఁ దోలి నిను రక్షింపంగ రాఁ డయ్యె; నే
పా కాల్మీయసతీసనామగుణవిఖ్యాతాళివాత్సల్యుఁడై
నీ కాఠిన్యము నీఁ దలంచె న॥సు॥ పత్నీ! యన్నపూర్ణాసతీ॥

శా॥ పేరంటంబున కేగి రాఁగ నయినం బే తీవు నాయాజ్ఞకై
చేరం జూచుచు వెండి రానినెలవుల్ జేకొంటి స్వాతంత్ర్యమున్?
హా! రామా! పిలువంగఁ బల్కవిది యే మన్యాయ మెవ్వారిలో
నే రీయుం బవ త్రిప్రసంగము? పరాకే? యన్నపూర్ణాసతీ॥ ౨

మ॥ పిలువం గొంకవలెన్ బయిం బడఁగఁ దన్వీ! సన్నిపాతజ్వరం
బలఁతిం బొందుచుఁ, దత్ప్రతిక్రియకు న న్వారాణ్మహేంద్రంబునం
గల న న్నెంత దలంచుకొంటివో గదా! కమ్మంది నే వచ్చులో
పల నీవెల్వని దెల్లవార్చె హతదైవం బన్నపూర్ణాసతీ॥ ౩

మ॥ పతి యన్నం బిడియంబు వోనితరుణప్రాయంబుచేఁ జెప్ప నో
డితి గా కిచ్చను, జన్మి దోఁప, ననుఁ దోడ్తేవేగమీ యన్న నో,
పితనో, వేఁడవె? యేమలంకరణములా? నే జయ్యె నీతీరయో!
స్మృతి లేదే? పెఱవాఁడనే? పలుకవేమే? యన్నపూర్ణాసతీ॥ ౪

మ॥ అపు డేఁ బండుగుముందు మార్గశిరమాసాంతంబునన్ వచ్చి చూ
చి పునర్దర్శన మాత వైశ మనునీచే వీడుకో లందనే?
యిపు డీతీరునఁ జూడ నయ్యె మరలన్; హేయంబు సంసార మీ
వపువుల్ బుగ్గలు; జీవితంబు చపలాభం బన్నపూర్ణాసతీ॥ ౫

మ॥ సరి పుట్టింటికి నీవు వచ్చి నెలపక్షం బయ్యె; నీమధ్య నే
మరలం బండుగుముందు వచ్చితిని; నీమైఁ జూచి యుప్పొంగితిన్;
దరుణీ! యింతటిలోనె న న్మఱచితే? దాంపత్య మి ట్లుండునే?
యొరపై పో వని యెప్డు నిన్ దలఁప లేదే? యన్నపూర్ణాసతీ॥ ౬

శా॥ కైవాడం గలవెజ్జు లేనిదగు గ్రామంబునన్ దుర్జ్వరా
యాసత్రాసము లావహిల్ల మది నెంతారాట మీవొందితో?
నీసామీప్యము నేను గాంచునటుకే నిన్ గన్గొఁ బెన్నొబ్బనో!
కాసంతైన నెఱుంగనైతి పిలువంగా ; నన్నపూర్ణాపతీ॥ ౭

శా॥ గోదావంచలహాలాణవైద్యునకు. భూగోళాపరార్ధాగత
శ్రీదాక్తర్ బిరుదాఢ్యవారవరుమిస్స్ కేను మున్షీని గా?
నాదేహార్ధమవైననీక యొదవెన్ సద్వైద్యలోపం బయో
తే! దాటంకము ధాత్రివ్రాఁత కెలఁ గల్మ్రా! యన్నపూర్ణాపతీ॥ ౮

శా॥ స్వైరాస్యం బిపు డింతఘోరమగునే? చేపుణ్కరింతల్ పగ
ర్పిరతన్ గ్రక్కిరి నుచ్చిరుల్ గుటుక యిందేసీ గుణం బక్కటా!
పారావారములోన ముగ్గఁ గలనావం బోలి యున్నావన
ధారుండైడె యెటు లీఁదనే భవసముద్రం బన్నపూర్ణాపతీ॥ ౯

మ॥ అకటా! నిద్దుర లేచి పొద్దుటను నే నాలోకముం జేయుమా
మక హామంగళరత్నదర్పణము, సమ్యంక్సంలె తామోపవా!
యక హానావికచారవింద మనిశాహ్లాదంబు గావించు నా
యకలంకం బగు పంచభింబ మిఁక నున్నా? యన్నపూర్ణాపతీ॥ ౧౦

## ద్వితీయవిలాపము.

---

శా॥ అన్నా! యెన్నివిధాలఁ గొల్చి నేఁ బ్రార్థించినన్ నిల్వఁగా
దయె నీప్రాణము విశ్వనాథుఁడు; బళే! యేను యొ? నేఁజేసమున్
మిన్నే విఱ్ఱిగిపిన్నినా కృత్యమున్ నేఁ బోసి కాపాడనా ;
వెన్నీపాడియుపంచ వాల్ప నగునే నీ కన్నపూర్ణాపతీ॥ ౧౧

మ॥ స్తవమాఘాదిమపత్నసోమునివసప్రాప్తద్వితీయాపరా
ఙ్ణవిషప్రాయమటీహరాద్విసుతికిత్ప్రాణంబు లైతే కళా
త్రవతంసంబు! పచింత్రము పోలవరపుం గ్రామంబు నీపుట్టిని
ల్లవునం చింతెను ; నిష్ఠ గిట్టినిలు నాదా? యన్నపూర్ణాపతీ॥ ౧౨

మ॥ అవురా ! పండుగనాఁడు దక్షిణజనం బంచుం గనన్ రాఁగఁ, బో
లవర గ్రామము నిన్నుఁ బట్టి యవలీలన్ గ్రమ్మిం గనే వ్యాఘ్రమై ?
దివితో రాయుకరళ్ళఁ బొందగను ఘనస్త్రీకృత్యయోగన్యథా
ర్థ్యప మే నెట్లు లెరింతు ? స్వస్థసమపర్ణా ! యన్నపూర్ణాసతీ॥ ౧౩

మ॥ స్తనమాఘాది మృతిన్, స్వయాశ్వనముసం బా మింతియగ్గాయుస
య్యె విధాల్పం డెటు పోసె నీ కెటులా పోయుం గాక, నేయక్కజప్
సనతిన్ జేయఁగ నేటి కేటిపయి మాసం జే గదా నీకుపాం
దవురా ! యేమి దురాగతం బిది యపర్ణా ! యన్నపూర్ణాసతీ॥ ౧౪

మ. పసుపై దేఁదులమూఁడుమాసములు నీ ప్రాయంబు ; నీకాఁపురం
పుడినంబుల్ హృదయేశుసప్తముసఁ బస్తానెల్లు ; దుర్వారసం
ధిదురంతజ్వరసన్నిపాతములతో నీయుష్క మంచానఁ బో
ష్మిదినాల్ ; నీమృతి చెప్పహాటె గృహలక్ష్మీ ! యన్నపూర్ణాసతీ॥ ౧౫

శా॥ సాపత్న్యం బని యీసడింప కజహాత్మానవర్య్యాపెద్రిమఁ గా
నోపుం బూనితి సుబ్బలక్ష్మిచరితం బో చెల్లు ! భర్తృప్రియ
వ్యాపారంబులు వోలుఁ గంకి వెఱవిం చాటింతువే ప్రేప్రియల్ !
పాపిష్ఠజ్వరదగ్ధనైతి; నుతరూపా ! యన్నపూర్ణాసతీ ॥ ౧౬

మ॥ పతిశుశ్రూషయు బంధుసత్కృతియు సాపత్న్యవ్యభ్యాతిప్రియం
బతిథిప్రార్థనదానపూజలును దేహాన్యస్వయంశోధనం
బిత దాలించుట లోను గా స్వసగొనా లీ పూని తుత్కృష్టమే ;
మృతి యే లొందితి యౌవనాద్యదశలోనే ? యన్నపూర్ణాసతీ ॥ ౧౭

శా॥ నేఁ జెండ్లాడి గృహప్రవేశమునకున్ మీయక్కఁ దోడ్తెచ్చినాఁ
డాబండిన్ సుద నుండి నీవు పడ, డాయన్ వచ్చి కేల్బట్టి గా
రాబం బొప్పఁగ నెత్తినాఁడ ననుచున్ బ్రార్థ్యంబునన్ నాకు యా
లైబత్తిం బచరించుకొన్ తడిని దుత్తైతన్నపూర్ణాసతీ॥ ౧౮

శా॥ బావా ! యం బలవాటునం గదియు బోరి ప్రాణేశు నన్నంచు నే
భావంబం దనుకొంటిఁ; దాంటిచన వెప్పాటం బొలంగించితో,
లేవం బీఁటలవిఁదనుండి యపుడే లేనైతి వాసిగ్గుతో
నీ వెం తైనను దాఁగి యుండవు గదా నేఁ డన్నపూర్ణాసతీ॥ ౧౯

శా॥ కుంచెం గనొక్క టూహ లాగి, యటుపై గొన్నాడ నీపెన్నెఱుల్,
పెంచెం జెన్నడు మట్టి నీ దనవి కేళీబర్హి ము న్నట్టినీ
పాలించ త్తృక్ష్యము ధూమకేతుఁడు గొనెం ; బచ్చారుఁ గచ్ఛార మే
పంపం బాఱఁగ నైతు నే ? ఘనతుఱుంభా ! యన్నపూర్ణాసతీ॥ ౨౭
మ॥ అనురాగాంబుధి బూదిలోఁ గలసెనే ? యందమ్ము వ మ్మయ్యెనే?
పని నేర్పుల్ పద డాయెనే ? పుడమి నీబత్తెంబు చెల్లాయెనే ?
వనితా ! లామరతంప మయ్యెడును నావంశంబు నీచేత నం
చనుకో, నీవును సుబ్బలక్ష్మివలెనే నైయె తన్నపూర్ణాసతీ॥ ౨౮
శా॥ నిన్నున్ వీడ్కొని నాఁడు రత్నమఁ గనన్ నేఁ బోయి నర్సాపురం
బన్నా ! నేఁ డిట నిల్వఁ బెంచు ననుఁ దోడల్లుండు రత్నంబుగా
గన్నన్ మేకొని, చేయి గన్వ్రాయ కీ వం దిద్దనీనాపటం
బు న్నేఁ గొంటి ; నిఁ కందె గాంచ మనకుం బోం దన్నపూర్ణాసతీ॥ ౨౯
శా॥ సింగిం గ్రొన్నెలరేక, మించు మొగులున్ వీడున్ మతిం గూడు ? న
బ్బంగిం గాక హారాద్ర్టిన్ దొడిమఁ బూభాతిన్ ననుం బాసితే ?
తుంగం దీపిక, వత్తిరూపెటు లటుల్ తోఁచుం గటా ! మామకో
త్సంగం బెన్నటఁ గాంతు నిన్ను ? మణిపూసా ! యన్నపూర్ణాసతీ॥ ౩౦

తృతీయవిలాపము.

శా॥ నీకన్ఱెప్పలు వాల కుండు నెపుడుం; దేవత్వ మూ వొందిలో ?
పైకం శాకులపాటు నొంద నధరస్పందంబు లే దగ్గిలో ?
హా ! కన్గొంటిని దత్త్వ మన్నుతపుఁ ఛాయాగ్రాహియంత్రంబునన్
వ్యాకృష్టం బిది నీదునీడ ; యిట నున్నా వన్నపూర్ణాసతీ ॥ ౩౧
శా॥ అన్నన్నా ! సుకుమారమై మృదులమై యంచత్సుఖస్పర్శమై
హొన్నొంజాయ నెసంగునీయొడ లటణ్ హోమంబు గా వించి వ
హ్నిన్, నీరూపు పటంబులో నిపుడు నే నీక్షించుచున్నా నిటణ్ ;
వెన్నం బాఱఁగ నైచి నాక వలసెణ్ బ్రేలన్నపూర్ణాసతీ ॥ ౩౨
శా॥ ప్రేగుణ్ దగ్గఁ గూర్చి లేఁతచిగురుం బ్రేణించుచుం గ్రాలుకెం
గేలిల్ నుందొడఁ జేర్చి తవ్విజయలక్ష్మీచ్ఛాయఁ ద ప్పించ ; నీ
కాలిం జూడవు ; మట్టె లే దొకటఁ ; బోఁ గాలంబు దాపించి కా
కే లానే శుభచిహ్నవిస్మృతి ? లతాఁగి ! యన్నపూర్ణాసతీ ॥ ౩౩

మ॥ గౌడవర్త్యాఖ్యనియోగివంశజుఁడు నాకున్ రామదాసుండు సం
గడికాఁడై యిట బోధనాభ్యసనపుంగాలేజి నీయేఁడు, నే
ర్పడరన్ నీడను జూచి వ్రాసినత్వదీయాలేఖ్యమున్ నిల్పితిం
బడకింటం; గని మెచ్చవే మతినిశిల్పం బన్నపూర్ణాసతీ॥ ౩౪

శా॥ మాసా లన్నిట శుక్లకృష్ణము లనం బక్షద్వయం బుండు నం
ద్రోసాధ్వీ! యదినిక్కమంచు మది నే నూహింప లే నయ్యెడన్;
నీసాంగత్యము గల్గునాళ్ళ నెల లన్నిన్ శుక్లరాత్రంబు లి
ష్టో సర్వంబును గృష్ణరాత్రములు నా కోయన్నపూర్ణాసతీ॥

శా॥ అయ్యయ్యో! కొనినాళు లుండి వెస రా నట్టేగఁ బుట్టింటికిన్,
దయ్యం బెత్తుక పోయెనే చెలియ! నిర్దాక్షిణ్యతన్ నిన్నటన్?
కుయ్యో! మొఱ్ఱో! యనంగ నాలుమగలన్ జోడుల్ విడం గొట్టున
క్రొయ్యాం బాపము గొట్టదే? కుడుపదే గో డన్నపూర్ణాసతీ॥ ౩౬

మ॥ చదువన్ వ్రాయను నేర్చి మూన్నెలల దీక్షన్, బ్రేమ నీవ్రాసిన
ట్టిది జాబేను సువర్ణపత్ర. మని పెట్టెం దాఁచితిం, గాన నేఁ
డది కన్నీటను దద్దయుం దడిపెదన్; హా! యేరి కంపింతు నీ
పెదమైజార్జలతారుచీరలను? సాధ్వీ! యన్నపూర్ణాసతీ॥ ౩౭

శా॥ కానం గుత్తుక నుల్చి పెంటిఁ గొని పోఁగా బోయ, నీడంబునం
దానుం బిల్లయు మేఁత మానుక కపోతం బున్నచందంబునన్,
నేనుం బిడ్డఁడు నింట నుంటి మలఁతన్, నిన్మృత్యు గొంపోవఁగా;
హా! నా కెప్పటియున్నరేయే మరల దిక్కా? యన్నపూర్ణాసతీ॥ ౩౮

మ॥ జడుపుం. గొల్పుమహాసముద్ర మనుచున్ సంసారముం బల్కినన్,
శెడఁ గొఁ గంటికిఁ బాన్పు నీకతన మున్ ఫేనాకృతిన్ నాకు; ని
ప్పుడో విస్ఫూర్జిత పూత్క్రియోత్థఫణి రాడ్భోగంబునుం బోలె న
న్నడలం బెట్టుచు నున్న దయ్యె నమరీడ్యా! యన్నపూర్ణాసతీ॥ ౩౯

శా॥ మీరున్ మల్లిక గూరుచుండుఁ డనుచున్ జేరిసునన్ గేళికా
గారంబం దిడుపాద మొక్కనిసి వేగన్ వెన్కకుం దీయవే?
యీ రే మల్లిక మాని యెంతుఁ గద నిన్నే; చేర రా వే మయో!
సౌరస్త్రీనుతరూపవర్తనవిలాసా! యన్నపూర్ణాసతీ॥ ౪౦

మ॥నిను సన్నంపుఁజివుళ్లపాన్పుననుకున్ దీనైన నీపట్టిటన్
బెడఁగుగఁ గ్రొవ్విరవాజిమొగ్గలగమిన్ నింపించుచు శాల్యన్న మె
న్నఁడు సద్యోదితపత్రిభాజనమునన్ వడ్డించి నీ వర్తిలిన్
గడుపారం గుడుపింకఁ బెట్టవు గదా నా కన్నపూర్ణాసతీ॥ ౪౮

పరలోకబంధ ప్రసంగము.

---

శా॥బంగారంబున కచ్చెఁ దావి యన రూపశ్రీకిఁ గోడౌచు నీ
కుం గల్యాణగుణౌఘ మీసుకృపఁ జేకూరన్ విలోకించి, చె
ప్పం గాంక్షించితిఁ గొన్నివాక్యములు; దివిన్ బంధుల్ గలా రెందఱో;
పొంగింప న్వలె వారి నీ మెలఁకువన్ ము న్నన్నపూర్ణాసతీ॥ ౪౯

మ॥సవతుల్ నల్వుర తోడ నీ వెనయఁ బంచత్వంబు ప్రాప్తించెనే?
కవుఁగింటం దొలుతన్ ఘటించు నతె యక్కన్ సుబ్బలక్ష్మిన్ వెసన్?
మివులన్ మన్నన సేయుమీ విజయలక్ష్మిన్; దన్ని మిత్రంబుగన్
దివియుం బుత్రవతీనివాప మొదవెన్ మీ కన్నపూర్ణాసతీ॥ ౫౦

శా॥కోరంగిం బిసనాటఁ దల్లి తలి మాకుం గాఁకటుల్ గొల్చి చే
యారం బొమ్మలపెండ్లి సేయఁ బనునా ఆశానేఁట నీడేశి సం
సారం బడ్డె సమాప్తి గాఁ బ్రసన మై సంతేది మున్ సన్నచి
న్నారిన్ వేంకమ నీ వెతింగి యొరఁగన్ ల గ్గన్నపూర్ణాసతీ॥ ౫౧

శా॥నీవాల్గన్నుల నీరు గాఱ వినవే నేఁ జ్రేయసీరత్నతా
రావళ్యాఖ్య రచించి యచ్చొడినపద్యశ్రేణిఁ? దాదృగ్గుణ
శ్రీవాసిం గని దన్నరత్నమవరాంఘ్రిద్వంద్వమున్ సోఁక నీ,
లావణ్యాకర మైన నీకుటిలఫాలం బన్నపూర్ణాసతీ॥ ౫౨

మ॥పటసం దర్శనజాత మాపరిచితిం బ్రత్యక్షనిధ్యాన ము
త్కటముం జేయఁగ డాసి, యక్క! యని తన్ గారామునన్ మ్రొక్కఁగాఁ
గటి కాసింపఁగ నీవు, నావిజయలక్ష్మీదేవి నైశేష్యచే
నటు మా మా దివిఁ; దేర్చు మా మెనననూయా! యన్నపూర్ణాసతీ॥ ౫౩

మ॥ ముకురంబుం గడసారియక్కుఁ గనుటం, బుచ్ఛక్కుయం జీవు మ
చ్చిగ మైఁ జిల్చెదుసుబ్బలక్ష్మిని సతీస్పృత్యుక్త, నామాలుగం
బిలి కాఁగింట మఱొక్కమా అనుపుమీ; మీ రేగురుం గోటరం
బోగిఁ జేయం బిరి తెంతెసంతసముఁ గండో! యన్నపూర్ణాసతీ॥ ౫౪

శా॥ మూగు శ్శిష్యరుఁ గూర్చి మీరు సవతుల్, భోగుంతగోంచత్కుల
ప్రాగాద్యబ్ధిచతుష్కసంభవమణుల్ భక్తిందముం గొల్చెదో,
నే గాటంబు వియోగవహ్నిశిఖలన్ రేయుం బగల్ వేఁగుదు
ర్యోగంబున్ స్మరియింప కుండుతేఁ బితా ల్లో యన్నపూర్ణాసతీ॥ ౫౫

మ॥ పరలోకం బిహలోక మిర్వుహరువుల్ భావింప; నిక్కంబు లో
నరయన్ లేకిలు శోక మొందితి నిసీ! యం దేను రా కుంశునే?
పరిరంభింబునఁ దేర్ప కుండు దెననున్? భద్రం బగుం గాతఁ; ద
త్పరమాత్మున్ భజియింతు శాంతి కేక నిత్యం బన్నపూర్ణాసతీ॥ ౫౬

శాంతిపంచకము.

---

మ॥ రెనుతాపంబు నశింపఁగా వదనదీధారాతటాకహ్రదా
బులిధానాదులు గల్గు నెన్నో; హృదయంబు న్నిచ్చలుం గాఁచుసీ
ఘనతాపంబు భవాబ్ధిజం బుడుపఁగాఁ గానన్ మఱొండెందు; నన్
మునుఁగన్ జేయవె నీదయాసుధను శంభూ! భక్తచింతామణీ॥ ౫౭

మ॥ ఘనసారంబును గంధసారమును రాకాచంద్రికాపూరమున్
వనజాతంబును వాతపోతమును హిమవారితంబు జన్నింబలెన్
బెనుచుం గా కడఁగింప లేవు సుమి సామీ! నామనోవేదనన్;
జెనుకన్ వేఁడెద నీదయాశిశిరదృష్టిన్! భక్తచింతామణీ॥ ౫౮

మ॥ శితదైనందినతర్పణాంజలిని దుర్దాహోపశాంతర్థమై
సుతు యాచింత్రు పితాళ్ళటన్; బిత నినున్ నూనుండయాచింతు నిం
దలిదాహంబునఁ; దావకీనసకయాపాంగంబునన్ దర్పణం
బు లేగం జేయవె నాకు నన్వహము శంభూ! భక్తచింతామణీ॥ ౫౯

మ॥ పరమాత్మా! భవదీయశీతలకృపాపాథోనిధానైకశీ
కరమే చాలును మామకోగ్రభవదుఃఖజ్వాల చల్లార్పఁ; జ
చ్చెర నేతెంచిన చిన్నచీమకడుపుం జిచ్చార్చి రక్షింపఁ, దుం
పురు గా కేటికిఁ దేనె బానెఁడును శంభూ! భక్తచింతామణీ॥ ౬౦

మ॥ భవనైదాఘదురాపతాపము శమింపం ద్వత్కృపాపారసిం
ధువుతీరంబున భాగ్యవంతులు వసింతుర్! పేద నౌనాకుఁ ద
త్సవిధంబం దిసుమంతె నిల్వ వసతిన్ స్వామీ! ప్రసాదింపవే!
భువనాధాతుఁడ వేమి నీకుఁ గొద? శంభూ! భక్తచింతామణీ॥ ౬౧

గద్యము.

ఇది యాత్రీయతురీయానంతర
ద్వితీయాక్షిక సంస్థితటస్థ
మనస్సాన్వస్థ్యాంతిరాయ
వడ్డాది సుబ్బరాయ
ప్రణీతము
సత్కృతి.

భామినీవిలాస కరుణవిలాసానుబంధము.

సమాప్తము.

## శాంత విలాసము.

---

చ॥ గురువిషయాటవీవలయఘోరవిలగ్నదవానలప్రస
త్వరబహుళార్చులన్ వికలభావము నొందిననామనంబు, స
త్వరము చకోరమట్లు లగుతన్, మిళదిందిరమాధురీధురం
ధరకమలాముఖాహారకనస్సుఖచంద్రిక మండలంబునన్॥ ౧

చ॥ జలనిధిసార్వభౌమతనుజావయనాంబురుహావలంబనా!
జ్వలనవిజిత్వరజ్వరజవత్వరభంగురుఁ డైననన్ను శీ
తలునిఁగఁ వేగ సేయఁగదె తండ్రి! జగత్త్రయరోచనంబు లా
లలితవిభాతసారసదళస్మయహారివిలోచనంబులన్;॥ ౨

ఉ॥ పంబినజాలి నాతపముఁ బాపుచు లోకులకుం దలంచుమా
త్రంబున, విద్యుతుల్ బహుళశతంబు లభంగరుచిన్ వెలుంగఁ, జి
త్రం బగునంబుజప్రియసుతాతటకల్పనగావలంబికా
దంబిని, మామకప్రణిపతిస్తుతిచుంబిని గావుతన్ సదా;॥ ౩

చ॥ అలరఁ గళింద శైలతనయాఘనతీరవనాంతరంబు, పాం
థుల కడుఁగన్ గతాగతతనుశ్రమ మధ్వమునన్, లతాశతం
బులము కొనంగఁ దన్, మధుర మారుచిఁ గ్రాలుతమాలభూజ మ
గ్గల మగుమామకశ్రమముఁ గ్రిక్కునఁ దా హరియించుఁ గావుతన్॥ ౪

మ॥ భువనవ్రాతముఁ జంద్రికామయసుధాపూరంబునం దన్పుచున్,
త్రివిధం బౌపరితాపమున్ నరులకున్ శీఘ్రంబ చల్లార్చుచున్,
దివిషద్బృందసదాభివంద్య మగుచున్, బృందావనం బున్కి గై
తవునూత్నాంబు ధరంబుమామకమనోధ్వాంతంబు మాయించుతన్॥ ౫

తే,గీ॥ గ్రీష్మచండాంశుమండలభీష్మకీల । మైనసంసారమున ననయంబు వేఁగు
నట్టినా వేదనను, బ్రావృడంబుదంబు । మాడ్కిఁ జల్లార్చు, వృష్ణికుమారవరుఁడు;॥ ౬

చ॥ విసుఁగు విరామమున్ గనక, వేములు దుస్తరసంసృతిన్, మలీ
మసవిషయాటవీవిషమ మార్గమునన్, గమియించుచున్, దగన్
వస మలునన్నుఁ దేర్చుతను, వారిజబాంధవనందినీతటా
వసథము నందగోపకలపఃఫలబాలతమాల మూదటన్;॥ ౭

ఉ॥ కోరిక లూరి పాల్కడలికూరిమికూఁతురు, గ్రుచ్చి కౌఁగిటన్
జేరుపఁ, బ్రేంకణంపులతచేఁ బరివేష్టిత మౌతమాలభూ
మీరుహముం బలెం, బొలుచు మేచకవర్ణుఁడు దోఁచుఁ గాత మిం
పార, నసుప్రయాణసమయంబున, నాహృదయంబులోపలన్;॥ ౮

క॥ తుందిల మగు నానందము। గందోయికిఁ జేయు నింతికాదంబిని, నా
డెందముఁ గడు నుడికించెడు। క్రందగు నారంట ముడుపుఁ గాలెన్ వేగన్॥ ౯

మ॥ కరమున్ స్వచ్ఛము లై, సుధాఘుటిక లై, కన్పట్టు నీశాసనా
క్షరముల్, నేఁ గల నైనఁ బాటి సలుపన్; సర్వేశ! గర్వాంధుఁడన్;
నెరసుల్ నాయెడ వేనవే లిటులు నీ వీక్షించి, నన్ స్వీయుఁ గన్
భరియింతెందును నిన్ను నంటి సనయుల్ నావంటినొండ్లుందురే॥ ౧౦

మ॥ శరధుల్ దాఁటుము; ప్రాఁకు మేరుశిరముల్; స్వర్లోకపాతాళముల్
చారు; మూర్ఖా! భవదాశ తగ్గ దది హెచ్చున్; వ్యాధు లాధుల్ నినున్
బరిపీడింపక యుండ, నిత్యసుఖమున్ వాంఛించితేఁ, గొమ్ము చె
చ్చెర శ్రీకృష్ణరసాయనం బితరసంసేవల్ స్పృహాయాసముల్;॥ ౧౧

చ॥ భవ మను పాడునూతఁ బడి, బాముల నొందెడు నన్ను నీ గతిన్
దవులఁ నుపేక్ష సేయఁ గరుణానయనాలయ! శౌరి! తొల్లి నీ
వవని మొసల్పవెట్టు లకటా! ప్రకటాఘును బింగళాఖ్యనా
రవనిత, దుష్టవర్తనుని భ్రష్టు నజామిళభూసురబ్రువున్॥ ౧౨

ఉ॥ చిక్కనిపాలు గ్రోలితి; భుజించితి మంచివాతుఁజక్కెరన్;
మెక్కితి పక్వగోస్తనుల; మింట సుధం జవిగొంటి; పంటితో
నొక్కితి రంభకెంపెదవి; నోరికి రాకంటువు కృష్ణ యన్న రెం
డక్కరముల్ బలెన్ మధురమా? పలుబాములఁ బడ్డజీవమా!॥ ౧౩

మ॥ భవదీర్ఘామయసిద్ధభేషజము, పాపగ్రావదంభోళి, సం
భవదజ్ఞానవిభావరీతిమిరభాస్వన్మండలం బుగ్రసం
చవిధక్లేశపులాశిదావశిఖి, కృష్ణా యన్నపద్ద్వయం
బవురా! యీనుడి ముక్త్యగారమునకున్ ద్వారంబు నా రంజిలున్;॥ ౧౪

ఉ॥ నే వినిపించెదన్, హితము నీ కిది; డెందమ! యాలకింప? బృం
దావనిఁ గామకోండ్లకను నాఘనకాయుని చాయ కెన్నఁడుం
బోవకు; చారుతామృతముపూరము జాలుపరిస్ఫుటంబునన్,
వే వలపించి నిన్నతఁడు, నీప్రియభోగములన్ హరింపఁడున్॥ ౧౫

క॥ జగమే సర్వము నశ్వర । మగు భంగుర మఖిలకంబెటు సంగము ; కట్టా !
మిగుల శ్రమపడెద రవ్విధ । మగుదానికి జను లి దేమియవివేకంబో॥ ౨౪

క॥ దినదినమును మృత్యుముఖం । బునఁ జొచ్చెదు రెల్లమానవులఁ గనుఁగొనుచున్
మనము విరమింప దిప్పటి । కిని దా విషయములవలనఁ గిరాచి త్రైవ॥ ౨౫

తే.గీ॥ పోయెను రాజ్యలక్ష్మి, కృపాణధార । లట్టె పయిపయిఁ బడనీ, భయంకరముగఁ
దల యముఁడు దీయనీ ; సుంత ధర్మపథము । దప్ప కుండెదఁగాని దెంధంబు నాది॥

క॥ పగవాఁడు నెత్తియూఁదను । బగబగ మండెంచుఁ గాక పావకు, నపిచేఁ
తొగఁ గోయుఁ గాక కాయము, । తగ వెవలితపలుకు నేఁ బదర తేశంబున్॥ ౨౭

క॥ శరణోపాయము నాకుం । దొరకద యని యేల పొగిలెదుర ? శ్రీపుండ ! నీ
స్మరణంబున నెన్నఁడు నుం । దరనందకుమారునానవము దగులదో ?॥ ౨౮

ఉ॥ మూకను నిమేషమున్ పలుకు, మార్యద నేకపదానమ త్రిభ్యాం
శీకలఝుంక్రియూరుచిర ఖేలనవృద్యము లైనసంపదల్ ;
కైకొనువారి నెల్ల నవి గన్నులు గప్పె, రమామనోహర
శ్రీకరపాదయుగ్మసరసీరుహసేవకు దవ్వు సేసెడున్ ॥ ౨౯

తే.గీ॥ ముగిసెఁ బాల్యము ; మృత్యువు మొగిసెఁ ; నకట ! యోట తే కిప్పుడానిద్రదారారిజీవి !
గ్రైనఁ గొచ వేమి ? నికుంచింపు మూద మఱచి ; । కడనె యున్నది తల్లిగంగాభవాని ॥

క॥ ధారుణి నిట్టటుఁ బఱచుచు । వారాటంపడుచు నేఁటి కంతఃకరణం
బారూఢుఁ డెపుడు నందక । మారకపరమప్రభుండు మచ్ఛిరమందున్ ॥ ౩౦

చ॥ మనస ! నను, మనోభవవిమర్దనపాదసరోజయుగ్మపూ
జన మతిభక్తి సంతతము సల్పెదువానిని, నాజనంజనం
బను పెనుగర్తమందు నకటా ! పడఁ ద్రోసెద వింతమాత్రచేఁ
దనయువిరోగకుఃఖశిఖితాపము నీకును గాక పోదు సూ ; ౩౧

క॥ మరకతమణిభూధరమో, । తరుణతగం బగుతమాలతరువో యనుచున్,
బోరసిరి శంకను మునివ్రం । జరు లవలోకించి రామచంద్రుని దొల్ల ;॥ ౩౩

చ॥ ఇది యమునాతరంగిణి యొ ? యె ట్లది తోయమయస్వరూప యౌఁ
గద ; యిది పచ్చతామరలొకో ? కా దది మాధురిఁ గాంచు నెట్టులం
చెవలను సంశయంబు జనియింపక యుండెడు నేరి కాదియం
దుదితశుతూవాలంబున ఘనశ్యాము నెమ్మెయిచాయఁ జూచియో ?॥ ౩౪

ఆ॥వె॥ మేఘమునకుఁ జాయ మెఱపుఁదీఁగయు, రాత్రి:శాంతునకును జాయ పుష్పలతయు
యగు తలంచి, పికప మాచుమానుఁ డెంతేఁగ వి! బాగునిగను విడుదయ్యూయపులను॥

ఉ॥ సంపద నీచగేహములఁ; సద్ద్విజాలిండుల లేమిగోలు; పు
ణ్యాంపుజనుల్ గతాయువులు; చిరాయువులు పాపులు; నీయనీతి వీ
క్షింప మహోగ్రకోపశిఖికీలలు పర్వెడు; నైన నేమి గా
వింపను నిన్ను? దీనుఁడను; విశ్వవిభుండవు నీవు; శంకరా!॥ ౩౬

## కృత్యంతమున జగన్నాథునిస్వోత్కర్షము.

మ॥ అమరాగారనగంబుఁ దొట్టి మలయాహార్యావృతాంభోధికూ
లముదాఁకం గలకావ్యకల్పనచణుల్! శంకింప కీ రానతిం
డి; మదన్యుం డెరుగోస్త నీరసధునీనిస్సీమమాధుర్యఘు
ర్యమ్మృదూక్తిప్రభుతాపదానుభవధన్యత్వంబు వాఁ డుండునే? ౩౭

ఉ॥ వీనులఁ దా సుధానుయము వేనివచోరస మాని వాణి, చేఁ
బూనినవీణెతంత్రుచయముం బలికింపఁ దలంప మానుఁ, ద
ద్ధ్యానుకెపంజితేశుభ్రుకటిభూషణభామణ మాలకింప, నె
వ్వానిశిరంబు కంపిలదు, వాఁడు ద్విపాత్పశు వెద్దుమొద్దగుఁన్ ౩౮

ఉ॥ తేనెయు ద్రాక్షపండు సుధ స్త్రీయధరామృత మేమి యైన, నె
ట్లైన ముదంబుఁ దార్పనివి యైనను, బండితరాజువాణి యే
మానిసి కేని మోద మలమంగఁడు ప్రాణము బొంది యుండినన్,
పీనుఁగు నిశ్చయంబుగను పీనుఁగు పీనుఁగు పీనుఁగే సుమీ॥ ౩౯

మ॥ కమియం బండి స్రవించుద్రాక్షరసపుంగర్వంబు వాపన్ సమ
ర్థము లౌవాక్కులఁ, గావ్యకల్పన మొనర్పన్ వీరు నేర్వన్నప
త్కమునన్, జెప్పము దాని మాదృశసమక్షంబందు; లేకున్న డెం
దమునందుండి వెలార్పఁ బోవు మది, మిత్రా! త్వత్కృతాఘక్రియన్॥ ౪౦

ఉ॥ నాకవితాకుమారి! వరనమ్మును వాంచకుమమ్మ, నిన్నుఁ బ
ట్గాకి నిరాకరించు నని కాలును వాఁడటు లోర్వ లేమి; నీ
కాకథ యేల? కావ్యకమలాంతరసీధుఘనీమసుప్రతా
నీకము మోములం గెలఁగి నిత్యము నృత్యము నీ వొనర్పవే॥ ౪౧

మ॥ పరవాక్యార్థునపత్రమం దనిశముఙ్ వాచంయముల్ పండితుల్;
ధరణీశుల్ కమలావిలాసమదిరాలీఢాత్రిమదాఘూర్ణితుల్;
స్మరపీడాలసపౌరయోషిదధరస్వారస్యధిక్కారి మ
ద్వరవాణీపరిపాక మేరసికుఁడిర్వ్యాఙ్ సల్పు లాస్యం బిలఙ్? ౪౨
క॥ ద్రాక్షేక్షుక్షీరసుధా। మాక్షికములనిరుపమానమధురిమలునుఁ, దా
మీక్షింపఁ బండితరాజవ। చోక్షరమాధురి కహా! కోహో రానరించుఙ్; ౪౩
శా॥ జల్లించెం గడవెళ్ళ శాస్త్రములు; నిష్ఠఙ్ సల్పె నిర్వ్యక్రియల్;
ఢిల్లీవల్లభపాణిపల్లవమునఙ్ శైఁ బ్రాయ ముంచెఙ్; గడుఙ్
డుల్లన్ వాసన లిప్పుడ్ఙ్ మధురయందుం గొల్చు గోవిందు; హా
యల్లోకంబుగఁ జేసెఁ బండితసమూహోత్తుంగుఁ డన్నింటినిన్ ;॥ ౪౪
క॥ లంజలకొడుకులు హరియిం। పం జాలురు యామకీనపద్యపుమణు లం
చుం జనియించిన శంకఙ్ । మంజూషను దీనిఁ జేసినాఁడం బూండీ॥ ౪౫
శా॥ కప్పం బుల్లదు; సైన నాళురచనోగ్రవ్యాఘ్రదంష్ట్రాళి కే
నప్పప్పా! కవితాలతాంగి నెర సేయం జాల; నానాటికిం
జొప్పంజాలఁగ గోరసాదు విడుకోంచుం బెంచి, యప్పాలచే
నుప్పిందుఙ్ రసికాంతరంగముల; బిట్టారింపు విద్వాంసులఙ్;
సుబ్బారాయఁడ; మేఘవేణిసుమనస్స్వాదు లస్మత్కృతుల్;॥

ఇది యాఱువేలవంశాభ్యుదితుండు
వె. సు. రాయఁడాంధ్రమొన
రించినయట్టిద భామినీ
విలాస నిగదితము
తుదిశాంతనామ
క విలాస
మగుఙ్

# హిందూసుందరి.

## స్త్రీలకత్యంతోపయుక్తమగు మాసపత్రిక

---

ఇది సుమారిరువదినాలుగుపుటలుగల పుస్తకముగా నెలకొకసారి చందాదారులకు పంపించబడుచుండును.

చందాసం॥మునకుఒక్క రూపాయిమాత్రమే

ఇటీవల చదువునేర్చిన స్త్రీలనేకులీమాసపత్రికకు వ్యాసములనువ్రాయుచుందురు.

ఇందు స్త్రీలకుపయుక్తములగుఅనేకాంశములున్న

౨ పతివ్రతాధర్మములు

౩ సంసారస్త్రీలు నేర్చుకొనవలసిన ధర్మములు

౪ దినకృత్యములయందు గమనింపవలసిన నేర్పు

౫ మంచివంటకములు జేయు పద్ధతి

౬ వినసొంపగు క్రొత్తపాటలు

౭ కుట్టుపనులు

౮ ఇంటిపిల్లలపెంచురీతి

౯ ధరింపవలసిన అలంకారములు

౧౦ నేర్చుకొనవలసిన శుభ్రత

౧౧ తీరికదినములలో చదువుటకనువగుమంచికథలు

౧౨ ఇతరదేశ స్త్రీలవృత్తాంతములు

౧౩ ఇదివరకెన్నడును యెఱుగనిక్రొత్తఆటలు.

మున్నగునవి ప్రచురింపబడుచుండును

ఇదివరకు ప్రచురించినపత్రికలు చూచినస్త్రీలు అనేకులుయీపత్రికను మిక్కిలిపొగడుచున్నారు.

ఒక్కపత్రికతెప్పించుకుని చూచినవెనుకయిందలిసుగుణములుమీకే తెలియగలవు. దరఖాస్తులు

పత్తిరాజు సీతారామయ్యగారుహిందూసుందరి పత్రికాపతి, ఏలూరు, గోదావరిజిల్లా అని వ్రాయవలెను

## ఏతత్కర్తృ విరచిత గ్రంథములును వానిమూల్యాదులును వివరించు పట్టిక

సూక్తిసుధాప్రకాశకము (లోకదృష్టాంత సమన్వితనీతిబోధక పద్యగ్రంథము 1892-[illegible] సంవత్సరములం ప్రవేశపరీక్షకుం బఠనీయమై 1898 వ సంవత్సరమునుండి ఐదవక్షము (Vth Form)నకుం బఠనీయముగా నిర్ణీతమైనది) తెలుఁగనుకూలటీకతో ... 0-10-

సుగుణప్రదర్శకము (1900వ సంవత్సరమున మొదటి ఫారమునకుఁ బఠనీయముగా నిర్ణీతమైనది ... ... 0-1

నందనందనశతకము (విష్ణుభక్తుల కానందకరము) ... 0-1-

భగవత్కీర్తనలు (సర్వభక్తహృదయానందకరము) .. 0-1-

భక్తచింతామణి (సర్వసంస్తుత భక్తహృదయాహ్లాదకరము) .. 0-5-

వేణీసంహారనాటకము (రౌద్రరసప్రధానము భారతకథ 1901 వ సంవత్సరము పట్టపరీక్షకుం బఠనీయము) ... 0-14-6

విక్రమోర్వశీయనాటకము (శృంగార రసప్రధానము) ... 0-8-0

ప్రబోధచంద్రోదయనాటకము (అద్వైత సిద్ధాంత బోధకము శాంతరస ప్రధానము) ... ... 0-11

చండకౌశికనాటకము (హరిశ్చంద్రకథ) ... 0-8

మల్లికామారుతప్రకరణము (ముద్రింపబడుచున్నది)

ఆంధ్రమేఘసందేశము (విప్రలంభశృంగారవర్ణనము) ... 0-

సూర్యశతకము (మయూరకవివిరచితమునకుఁ దెలుఁగు) ... 0-

గౌతమీ మహాజల మహిమానువర్ణనము, గోదావరీధూమనౌకావిహారము చాటుప్రబంధము రెండు చంపకమాలికలు) ... 0

సతీస్మృతి (సానుబంధము, కరుణరసము) ... 0

దైవభక్తినిగురించిన యుపన్యాసము ... 0

సుమనోమనోజ్ఞము (ప్రథమభాగము) ... 0

,, (ద్వితీయభాగము పెద్దక్షరములు) .. 0-

పైగ్రంథములు కావలసినవారు రాజమహేంద్రవరమున దొరతనము వారి బోధనాభ్యాసన పాఠశాలయందుఁ బ్రధానాంధ్రోపాధ్యాయులగు పెద్దాడ సుబ్బారాయఁడు గారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును